గలకలనవ్వులోఁ గన్నులు మెఱయు
నాప్రేమరత్నంబు నవ్వుచున్నాఁడె!

౨

తెమ్మెరపాటలోఁ దేరినచలువఁ
దుమ్మెదపాటలోఁ దోఁచునాదంబుఁ
బువ్వులపాటలోఁ బొడమిన తేనె
వెన్నెలపాటలో వెడలిననిగ్గు
రాగమాలికఁ జేర్చి రతనాలపాట
సుకవినై పాడుచు సొగయుచు నుండ
నీప్రేమకరముల నెమ్మేను నిమిరి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

3

మధువనస్పతులతో మందు సేవించి
యజ్ఞానరోగంబు నడఁగింపలేక
మధురాక్షరములతో మంత్రముల్ చదివి
యాశాపిశాచంబు నదలింపలేక
విస్తృతారణ్యముల్ విశ్వకోశంబు
శోధించి శోధించి చూచుచు నుండ
సిద్ధామృతం బిట్టె చేతిలోఁ బెట్టి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౮

విరిదండలకు నెంతో విలువ లేదనుచు
స్వర్ణభూషణముల నంతరించితిని;
బంగారునగ లెంతో బరువయ్యె ననుచు
మెఱుఁగులకై గ్రుడ్లు మిడుకరించితిని;
యాసించువారికే యలజడుల్ గాని
కోరుకోరికలకుఁ గొదలు లేవనుచు
నాజ్ఞానమూర్తివై ననుఁ బ్రబోధించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౯

జోడుదివ్వెలు వెల్గు చూపించుచున్న
సూర్యచంద్రులు కాంతి సూచించుచున్న
మనసులో నేమాయ మబ్బు పట్టినదో
కడలెల్ల గాఢాంధకారమే యయ్యె;
ఈచిమ్మచీకటి కీవెల్గునకును
నేనాఁటిసంబంధ మెఱిఁగింపు మనిన
నామాటతోడనే నను హెచ్చరించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౦

కనుఁగొన్నయట్టుగాఁ గలలఁ గాంచితిని;
గద్గదస్వరముతోఁ గలవరించితిని,

మెఱసినచోటెల్ల మెలపుతో వెదకి
దొరకినమణి యెల్ల దొలిచి చూచితిని,
ఇన్నింటఁ గనరాని యీరత్నమూర్తి
కన్నిటిలోననే గానవచ్చుటకుఁ
దాత్పర్య మేమని తలపోయుచుండ
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

చేయిజాఱెడుబిడ్డ చెలువంబుఁ జూచి
చిదిమివైచెడుకొమ్మ చిగురాకుఁ జూచి
యారిపోయెడుదివ్వె యందంబుఁ జూచి
జాఱిపోయెడుచుక్క చందంబుఁ జూచి
వట్టిపోయెడు సెటివడిసీటిఁ జూచి
వాడిపోయెడిపువ్వు వగనవ్వుఁ జూచి
ప్రకృతిలీలలఁ జూచి ప్రణయంబుఁ జూచి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

కళల జాఱించెడి కడసారివెలుఁగుఁ
జుక్క పుట్టిననాఁడె చూడలేనైతి;
నెత్తావు లెడలించు నిట్టూర్పుఁ బొగలఁ
బూవు పుట్టిననాఁడె పొడగానవైతి;

నిఖిలంబు వెలిఁగించు నీచిత్రకళల
సకలంబు మఱఁగించు చాయ లెక్కడివొ
నీదివ్యతత్త్వంబు నేఁటికిఁ జూపి
నాజ్ఞానరత్నమా నవ్వుచున్నావె!

ప్రేమరత్నము స్వర్ణపేటికఁ బెట్టి
మమకారమునఁ జిక్కి మఱచిపోయితిని;
భావరత్నము జాళువాపూల దాఁచి
మదవాసనలఁ జొక్కి మఱచిపోయితిని;
జీవరత్నముఁ బైఁడిచెంగున ముడిచి
మాయలోపలఁ జిక్కి మఱచిపోయితిని;
నన్నె నే మఱచిన నావంకఁ జూచి
నాజ్ఞానరత్నమా నవ్వుచున్నావె!

౧౦

నానాఁటికిని దోఁచు నాయింటిదివ్వె
యేనాఁటి కానాఁడె యెత్తి పోసితిని;
ఏమూలనుంటివో యీ వందులోనె
బంగారుతీఁగలఁ బండించినావు;
కనుపాపలో నున్న కల్యాణమూర్తి
నిండాఁకఁ గనలేని యీమందమతికి
దివ్వెఁ జూపఁగ దివ్వెఁ దేవలె నంచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౧

ఘనపుటంబులనైనఁ గ్రాగనినీవు
కన్నీటి వేఁడికే కరఁగుటఁ గాంచి
తొమ్మిదినిధులైనఁ దూగనినీవు
తీయనిమాటకే తేలుటఁ గాంచి
యీ రేడుజగములం దిముడనినీవు
నలుసంతకంటిలో నటియింపఁ గాంచి,
యీవింత లేమంచు నే నెంచుచుండ
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౨

ఏపుణ్యగరిమనో యీతళుకు గలుగ
నేయదృష్టముననో యెగురుట గలుగ
నిర్మలజ్యోతిని నేనే యటంచు
మిణుఁగురుపురుఁగునై మెఱసిపోయితిని;
నిఖిలంబు వెలయించు నీమూర్తి యెదుట
మినుమాని కముగూడ మిణుఁగురే యనుచు
నీదివ్యతత్త్వంబు నేఁటికిఁ జూపి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౩

పాదాలకడఁ బుట్టి పసివ్రాపపిందె
తెల్లిదుకుండఁగఁ దన్ను దిగమ్రింగుచుండ

భావింపలేని యీప్రసవంపుబాల
కమ్మఁదావుల నెల్ల కడలఁ బ్రాఁకించి
యింతమాత్రానకే యెదలోనఁ బొంగి
ముడుతవాఱిన తన మొగ మింత చేయఁ
జింతలో నింతలోఁ జిఱునవ్వు లనుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౮

ఏమూలనుండియో యెప్పుడో వచ్చి
చిగురుగొంగులనున్న జీవధనంబుఁ
బొంచుండి యెవ్వరో పుణుకుచునుండఁ
దెలియంగలేని యీతీవతన్వంగి
వలపించుచిన్నెలవన్నెలఁ జూపి
సహకారమునఁ గోర్కి సాగించుచుండఁ
జింతలో నింతలోఁ జిఱునవ్వు లనుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౧౯

వాలుకాకణముల వరమణుల్ చేసి
వెలిఁగింపఁజాలు నీవిమలతేజంబు
వారిశీకరముల వాహినుల్ చేసి
ప్రవహింపఁజేయు నీప్రణయామృతంబు,
అల్పరేణువుల బ్రహ్మాండముల్ చేసి
యాడింపఁజాలు నీయద్భుతశక్తి

నేనొక్కసారిగా నీకళాలీలఁ
దెలిసి కన్గొనఁగంటి దివ్యరత్నంబ!

౧౬

కరుణాపయోరాశి గర్భంబునుండి
యమృతకుంభంబుతో నవతరించితివో?
కనకభూమీధర గర్భంబునుండి
యమృతవాహినులతో నవతరించితివో?
గగనకల్లోలినీ గర్భంబునుండి
యమృతాంశుకళలతో నవతరించితివో?
నాజ్ఞానమూర్తివై ననుఁ బ్రబోధించి
పరమార్థ మెఱిఁగింపు ప్రియరత్నంబ!

౧౭

కాలజీమూతాంధకారగర్భమున
నేమియుఁ దోఁపక యే నున్నవేళ
సన్నిధిఁ బెన్నిధి చాడ్పునఁ దోఁచి
కన్నుల వెన్నెలఁ గాయించినపుడె
కాననికన్నులఁ గలఁగూర్చు వెలుఁగు
నీలోపలి వెలుంగు నేఁ జూడఁగంటి
నే వెల్గునుండి నీ కీవెల్గు కలిగెఁ
చెప్పవే చెప్పవే జీవరత్నంబ!

౧౮

చిన్నిచెక్కులఁ బాలబిడ్డలు మెఱయు
చిన్నారిపసిఁబాప చిఱునవ్వు వెలుఁగు,
బారలు సాఁచి పైఁ బడుబిడ్డ నెత్తి
కౌఁగిలించెడి తల్లికన్నుల వెలుఁగు,
ప్రథమదర్శనమునఁ బ్రణయంబు నించు
తరుణులవలచూపుఁదరఁగల వెలుఁగు,
నీవెల్గులోపలనే యెట్లు తోఁచెఁ
బలుకు మీచిత్రంబు భావరత్నంబ!

౧౯

సంజకెంజాయల సానదీరితివో
చక్కనిచుక్కల జతలఁ చేరితివో
తొలుకారుమెఱుపులతోఁట లేలితివో
వెలలేనివెన్నెలవెల్లిఁ దేలితివో,
విజ్ఞానదీపికవెలుఁగులోనుండి
విశ్వంబు వెలయింప వెడలివచ్చితివో
నిజముగా నీవెల్గు నీకెట్లు గలిగెఁ
దెలుపవే తెలుపవే దివ్యరత్నంబ!

౨౦

తల్లిదండ్రులు లేక తనయులు లేక
యిష్టబంధులు లేక యిల్లాలు లేక
కుడువఁ గూడును గట్ట గుడ్డయు లేక
దిక్కేఁడి విలపించు దీనమానవుల

యూఁకటిమంట వెన్నంటినకముప్పు
లగ్గికొండలరీతి నదరుచునుండ
నార్తులఁ దొలఁగించు నమృతంపుఁగళలఁ
బ్రసరింపవే నీవు ప్రణయరత్నంబ!

౨౧

కామాదివికృతులు క్రంచెలఁ గొట్ట
వాతాదిదోషముల్ వడిసుమల్ వెట్టఁ
దనవారలైనను దరిఁ జేరరాని
ఘనరోగముల సుక్కి కడగండ్లఁ జిక్కి
కన్నవారల కెల్లఁ గడుపులు దఱుగ
దుస్సహాబాధల దురపిల్లువారి
సదయుండవై చూచి సంజీవకళలఁ
జిలికించి ప్రోవవే సిద్ధరత్నంబ!

౨౨

నిత్యకళ్యాణంబు నిష్పచ్ఛరమున
నూషరక్షేత్రాన నుద్యానవనము
కమ్మనివిరిదమ్మి గలుషపంకమునఁ
జివికించుచింతలోఁ జిఱునవ్వు మొలక
యమృతకాసారంబు నమ్మరుభూమి
దుఃఖసాగరములో దుగ్ధఫేనంబు
నంతరింపఁగఁజాలు సౌవర్ణకళలు
గలవుగా నీలోనఁ గాంతిరత్నంబ!

౨౩

ఆర్తస్వరంబులో నానందగీత
మాలకింపఁగఁజాలు సమ్మృతమూర్తులకుఁ
దీవ్రశాపంబులో దీవనపదము
పట్టిపాడఁగఁజాలు పరమశాంతులకు
మోహజాలంబులో ముక్తిమార్గంబు
తరచి కన్గొనఁజాలు తత్త్వవేత్తలకు
నీదివ్యకళ కళానిలయమో యేమొ
సత్యంబుఁ దెలుపవే జ్ఞానరత్నంబ!

౨౪

అద్దించి రెవ్వరో యాకారలీలఁ
జిత్రించి రెవ్వరో చిత్రవర్ణముల
మెఱపించి రెవ్వరో మింటి కెక్కించి
మఱపించి రెవ్వరో మాయఁ జిక్కించి
యే నింద్రధనువనై యున్నాళ్ళదాఁక
నెండవానల నంది నిఱుకుచుఁ దుడకు
నీనిత్యకళ్యాణనిర్మలకళలఁ
దెలిసి కన్గొనఁగంటి దివ్యరత్నంబ!

౨౫

చక్కనిచుక్కల చకచకల్ సూచి
నిద్దంపుమొగ్గల నిగనిగల్ సూచి

తామరపై నీటితళతళల్ జూచి
మింటిపై మిణుఁగురు మిలమిలల్ జూచి
నాఁడెంబు దెలియని నా శైశవమున
నవి యెల్ల రత్నాలె యనుకొంటిఁ గాని
బొగ్గులలో మణుల్ పుట్టించు నిన్నుఁ
దెలియంగ లేనైతి దివ్యరత్నంబ!

౨౬

ఎఱుఁగనితనములో నేడుపులో నె
పకపక నవ్వితిఁ బసుపుఁబొత్తిళ్ళఁ;
నానవ్వు లావేళ నాతల్లిప్రేమఁ
దళుకొత్తుకన్నులఁ దళతళలాడెఁ;
ఆనవ్వు లాతళ్కు లానాఁటినుండి
యీనాఁటిదాఁక నే నీక్షింపనైతి
నేఁటి కాచిఱునవ్వు నీకంట మెఱియ
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౨౭

ఆనాఁడు పసిపాప నై యున్ననాఁడు
తూఁగుటుయ్యాలలోఁ దూఁగెడునాఁడు
జోలపాటలలోనఁ జొక్కెడునాఁడు
తెలివియు నిద్రయుఁ దెలియనినాఁడు
ఈవు నే ననుభేద మెఱుఁగనినాఁడు
చూచి చూడనిరీతిఁ జూచితి నాఁడు;

నాయదృష్టంబున నాఁటికి నేఁడు
తెలిసి నిన్గనఁగంటి దివ్యరత్నంబ!

-౨౦-

నిడుదపెన్నెఱులలోఁ నీలాలఁ జూచి
పక్వాధరములలోఁ బగడాలఁ జూచి
మొలకదంతములలో ముత్యాలఁ జూచి
రమ్యహాసములలో రతనాలఁ జూచి
రతనాలగను లన్న రమణులే యనుచు
యౌవనమదముచే నలరితిఁ గాని
నిత్యమోహనకళల నీసొమ్ము లనుచు
భావింపలేనైతిఁ బ్రణయరత్నంబ!

తొలఁగిపోయినదాఁకఁ బ్రమ్మింపఁజాలు
సౌభాగ్యవైభవసంపత్తిఁ జూచి
వయసు తీరినదాఁక వలపింపఁజాలు
కామినీమణులసింగారంబుఁ జూచి
కామాంధకారంబు గన్నులఁ గప్పు
నీవంకఁ గనలేక నే నున్నవేళ
నాదివ్వె వెలిఁగించి నావంకఁ జూచి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౦

కలికివాల్జూపుల కలకల లేక
క్షణము యుగంబుగాఁ గడపిన నేను,
మిసిమిబంగారంపు మిలమిల లేక
గడియ కల్పంబుగాఁ గడపిన నేను,
ప్రాణంబునకుఁ బ్రాణమై యున్న నిన్ను
మఱచియుండినయట్లె మది నెంచనైతి;
ఈమందమతిఁ జూచి యిన్నాళ్ళవాఁక
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౧

కన్నులలో వెల్గు కనుఁగొనలేక
పవలింటిలో వెల్గు పరికింపలేక
పాడింటిగోడలపై సందులందుఁ
జీకటిగూటిలోఁ జిక్కిపోయితిని;
ఇంతింతకను లున్న యీగ్రుడ్డిగూబ
తిమిరరోగము మాన్పఁ దెలివిమం దిచ్చి
చీకటిపొరఁ దీసి చేతిలోఁ బెట్టి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౨

గాజువారిన చిల్లిగవ్వలఁ జూచి
పసిడిమాలిన గడ్డిపరకలఁ జూచి

గాలిఁ దూలెడు పొల్లుకాయలఁ జూచి
పెటిలిపోయెడి కుండపెంకులఁ జూచి
పేరాసపోని నాపెద్దకాలమున
హేమరత్నము లంచు నెంచితి; గాని
కోర్కుల్ పండించు గుణమణి నిన్ను
సాధింపలేనైతి జ్ఞానరత్నంబ!

౩౩

ననుఁ బ్రాణముగ నెంచు నాకన్నతల్లి
యడిగిన వెల్ల నా కందించుచుండఁ
దనివి తీరక యాస తల కెక్కి త్రిప్ప
దేశదేశంబులఁ దిరుగుచునుండఁ
దిరిసి కూర్చినతేన తెరఁ గొంచుఁ బోవు
నెఱుకువానిని దేనెటీఁగలఁ జూపి
నాచూపుతోడనే నను బ్రబోధించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౪

చీకటు లడఁగించు చేదివ్వెతోనె
కనకసౌధంబులఁ గాల్చివైచితిని,
ఆమయంబు లడంచు నమృతంబుతోనె
తీయనిప్రాణముల్ తీసివైచితిని,
సత్యంబు బోధించు చదువులతోనె
మఱపించి జగ మెల్ల మాయఁ జేసితిని

నాతప్పు మన్నించి ననుఁ గటాక్షించి
దర్శనం బిచ్చితే దైవరత్నంబ!

3౫

పన్నీటఁ బెంచిన ప్రణయంపుఁదోఁట
గ్రొన్నెత్తురులసోనఁ గురిసి ముంచితిని;
మౌళిఁ దాల్చుచునుండు మణికిరీటంబుఁ
బాదరక్షల మట్టి పగులఁ గొట్టితిని;
కొఱవిదయ్యముఁ బోని కోపంబుచేత
నిలు వెల్ల సిప్పుగా నే నున్నవేళ
నీశాంతకరముల నెమ్మేను నిమిరి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

3౬

దోమనై గజరాజు దొరసి ముట్టితిని,
రిక్కనై శేరాజు రెక్కఁ బట్టితిని;
ఈఁగనై ఖగరాజు నెదిరి నిల్చితిని,
పురుగనై ఫణిరాజుఁ బోరఁ బిల్చితిని;
ఒడ లెఱుంగని గర్వ ముప్పొంగిపోవ
నెదిరి నన్నెఱుఁగక యే నున్నవేళ
నాపుస్తకంబులో నావేషఁ జూపి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౭

ప్రకృతిరాజ్యంబునఁ బలుమాఱుఁ దిరిగి
స్వప్నరాజ్యంబుతో సరిచూచి చూచి
సౌఖ్యవాహినులలో స్నానంబులాడి
దుఃఖవాహినులతోఁ దులఁ దూఁచి తూఁచి
తలక్రిందు గావించి తల కంటగించి
తెలిసియుఁ దెలియక తిరిగి వేసారి
యాకస్మికముగ నీయానందకళల
వెలుఁగున మేల్కాంటి విమలరత్నంబ!

౩౮

నిరుపేదలకుఁ బొట్ట నిండుటఁ జూచి
నిధినాథు లాఁకట నీల్గుటఁ జూచి
కోరక సౌఖ్యముల్ కూడుటఁ జూచి
తోఁయక సంపదల్ తొలఁగుటఁ జూచి
చూచి చూడనిరీతి సుఖదుఃఖములకు
నీడ లౌదురుగాని నీయున్నచోటుఁ
గోటికొక్కఁడుఁ జేరుకొనఁజాలఁ డనుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౩౯

నీపుస్తకంబులో నీయాకులోన
నీపాట నీపేరు నే గానలేక.

నీచరిత్రంబులో నీకీర్తిలోన
నీమూర్తి నీవెల్గు నేఁ గాన లేక,
సారస్వతం బెల్ల సాధించి చూచి
విశ్వకోశం బెల్ల వెదకి గాలించి
యింకేది గతి యంచు నెదఁ గుందుచుండ
దర్శనం బిచ్చితే దైవరత్నంబ!

౪౦

సుడిగాడ్పు టెండల సోలిపోకుండఁ
బక్షినై నినుఁ గూర్చి పాడుకోనిమ్మ!
మబ్బు పెంచెరలలో మాటు గాకుండఁ
జుక్కనై నీసొంపుఁ జూచుకోనిమ్మ!
ఇసుకకొండలదండ నింకిపోకుండ
సెలయేటినై నిన్నుఁ జేరుకోనిమ్మ!
నీకొల్వుఁ గోరితి నిరతంబు, నిన్ను
సేవించుకోనిమ్మ జీవరత్నంబ!

౪౧

అమ్మలపాదులతో నమృతరసంబుఁ
బువ్వుఁదీవలకును బోసెడివేళఁ
గొదమతుమ్మెద నొవ్వఁ గుట్టిన చేత
గున్నపొన్నకు బోదెఁ గూరుచువేళ
ముల్లునాటినపాదముల నల్లనరిగి
మల్లెతీవకు నీరు మలపించువేళఁ

## తృతీయభాగము

ప్రణయంపుఁ బూఁదోఁటఁ బచ్చికబైట
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౮౨

పాపపుఁగొండలు బరువంటిఁగాని,
పైఁడికొండలకున్నై ప్రాఁకులాడితినె?
నిలుపుమీ నన్ను సన్నిధి నంటిఁగాని,
పెన్నిధు లిమ్మని పెనఁగులాడితినె?
కఱకురాళ్ళను గూడఁ గన్నీరు గురియ
వెట్టినై నినుఁగూర్చి విలపించుచుండ
నేమూలనో డాఁగి యున్నాళ్ళదాఁక
నా ప్రేమరత్న నవ్వుచున్నావె!

౮౩

నీమాట లనుచుంటి నిను మెచ్చుచుంటి
నీకలల్ గనుచుంటి నిన్నెంచుచుంటి
నీపాట వినుచుంటి నీచెంతనుంటి
నీలీలఁ గనుచుంటి నీలోననుంటి
నివియెల్ల నిట్లుండ నిన్నాళ్ళదాఁక
నెన్నియో జన్మంబు లెత్తితిఁగాని
కన్నుండి నీమూర్తిఁ గననైతి ననుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౪౪

కాంతులు గలచోటఁ గన్నులు మూసి
చీకటిబీటిలోఁ జిందులాడితిని;
ప్రణయంబుగలచోట భావంబు దాఁచి
యల్లరిమూఁకతో నాటలాడితిని;
నాకంటిదీపంబు నాజంటితేనెఁ
దెమ్మని యెపుడైనఁ దీండ్రింతు ననుచుఁ
బదిలంబు చేసిన పరమాత్మ నిన్నుఁ
దెలిసి నేటికిఁ గంటి దివ్యరత్నంబ!

౪౫

చిత్రంబు లెన్నియో చేసితిఁగాని
నీమూర్తిఁ జిత్రింప నేనేరనైతి;
ఎన్నియో వన్నెల నెఱిఁగితిఁగాని
నీవన్నె లద్దింప నేనోపనైతి;
పలుకులకందని భావరత్నంబుఁ
గన్నులఁ జూపించు కళలచే మెఱయు
కవితనై నినుఁగూర్చి గానంబు చేయు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౪౬.

నాభక్తి పిల్లున నటియింతుఁగాని
నటియించు మెప్పులు నాకేమి తెలియు!

నా ప్రేమ పొంగున నవ్వెదుఁ గాని
నవ్వించు త్రిప్పులు నాకేమి తెలియు?
కవిత యబ్బెనుగాను గలసి నిన్ బాడి
నాట్యంబు సేయుచు నవ్వుచునుందు
నెవ్వ రేమనుకొన్న నింకేమి నాకుఁ
దెలిసికొంటిని నిన్ను దివ్యరత్నంబ!

౪౭

వర్ణంబు లెల్ల నీవన్నెలో నుండ
శబ్దంబు లెల్ల నీచదువులో నుండ
నర్థంబు లెల్ల నీయాత్మలో నుండ
భావంబు లెల్ల నీపదములో నుండఁ
గల్పన లెల్ల నీకాంతిలో నుండఁ
గవిత లన్నియును నీకళలలో నుండ
నేను పాడినపాట నీపాట గాక
వేఱె యెక్కడిపాట విబుధరత్నంబ!

౪౮

నీకొండలోనఁ జన్నీరు పొంగించి
వెన్నెలవెలుఁగులో వెన్నదీయించి
చుక్కలలోఁ దేనెచుక్క లొల్కించి
పలుకులలోన నీ భావముల్ చూపి
కవితచే లోకంబు కన్నులమూయు
కవిని నీలీలానుకవిని గావించి

ప్రణయరాగమున నీపాట పాడించి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౭౯

నీనామగానంబు నేఁ జేయువేళ
నగుఁగాక మలహరి యానందలహరి;
నీమంత్రమ్ము జపంబు నేఁ జేయువేళఁ
బ్రత్యేకబీజంబుఁ బ్రణవమౌఁగాక;
నీగుణధ్యానంబు నేఁ జేయువేళ
ఘనకీర్తి యగుఁగాక కల్యాణమూర్తి;
గుడి నిల్చుకొను వేళఁ గుటిలచిత్తంబు
చెదరకుండినఁ జాలు జీవరత్నంబ!

౮౦

కృపణత్వమునఁ జేసి కృషి చేయలేక
పండుపంటపొలంబు పసిబీడు చేసి
పెఱవారిమళ్ళలోఁ బేరాసఁ జేసి
పక్షులఁ దోలుచుఁ బరిగెల నేఱి
యాఁకలి దీరక యాయాసపడుచుఁ
దప్పుదారులలోనె తడఁబడుచుండ
నాయదృష్టమున నన్నాళ్ళ కీవేళఁ
బ్రత్యక్షమైతివే భాగ్యరత్నంబ!

౫౧

నీలంపుఁ దెరవెన్క నిధు లున్నవనుచు
నేలకు నింగికి నిచ్చెనల్ గట్టి
యేవేళఁ దప్పక యెక్కుచు దిగుచు
నడియాసఁ దూలుచు నడలుచు నుండఁ
బ్రొద్దుమూసినమబ్బు పొర నొత్తగించి
నిలిచినచోటఁ బెన్నిధులు చూపించి
వాంఛితంబులు నాకు వలదనిపించి
నాభాగ్యరత్నమా నవ్వుచున్నావె!

౫౨

నీవెల్గు నామది నిండుటే కాక
నిఖిలదిగంతముల్ నిండిపోయినది;
నీయీవి నాయొడి నింపుటే కాక
నిఖిలసంసారముల్ నింపివైచినది;
నీమూర్తి నాచెంత నిలుచుటే కాక
నిఖిలలోకంబుల నిలువరించినది;
నేనింతవాఁడనై నీయంతవానిఁ
దెలియు టబ్రము గాదె దివ్యరత్నంబ!

౫౩

విశ్వంబు నేలు నీవిభుత సూచింప
[illegible]

భవదీయ సేవావిభవము సూచింప
రాజరత్నంబె నీరాజనం బయ్యెఁ;
దిలకింపరాని జ్యోతిర్మూర్తి వీవు
లక్షింపరాని కళామూర్తి వీవు
నీదివ్యమూర్తి వర్ణింప నేనెంత?
దయఁజూడు దయఁజూడు దైవరత్నంబ!

౫౮

గాలివాన కొకింత కలఁగిపోకుండ
సుడిగుండములలోన సుడిసిపోకుండ
బలితంపుఁ గొండలఁ బగిలిపోకుండ
మొత్తంపుఁదరఁగల మునిఁగిపోకుండఁ
దడఁబాటుతో దారి తప్పిపోకుండ
నడిసముద్రంబులో నాయోడఁద్రిప్పు
నావికరత్నంబు నక్షత్ర మగుచు
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౫౯

సత్యమే జయమని చదివిన నేను
సాధింపలేనైతి జయకేతనంబు;
శాంతమే సుఖమని చదివిన నేను
శోధింపలేనైతి సుఖనిధానంబు;
తెలియని తెలివితోఁ దిరిగెడి నాకుఁ
[illegible] సువర్ణంబు [illegible]

తృతీయభాగము

గరతలామలకంబు గాఁ బోఁచురీతిఁ
దెలిపి చూపితిగాదె దివ్యరత్నంబ!

౫౬

ప్రణయైకమూర్తి నాపజ్జను నిలువఁ
గష్టంబు లెల్ల సుఖంబులే యయ్యెఁ
గల్యాణమూర్తి నాకన్నుల నిలువ
దుఃఖంబులెల్ల సంతోషంబు లయ్యె
నిర్మలమూర్తి నాయెమ్మది నిలువ
నానంద మెల్ల బ్రహ్మానంద మయ్యె
నజ్ఞాన మెడలించు నానందకళలఁ
దెలియాడెద నింక దివ్యరత్నంబ!

౫౭

లోకంబులను గుక్షిలోఁ దాఁచి ప్రోచు
దివ్యమూర్తిని నిన్నుఁ దెలియంగ లేక
తరుణివో పురుషుఁడో తలఁప నేమూర్తి
వీవని వెఱ్ఱినై యేనెంచుచుండి
మధురప్రణయ సుధామయ మాతృమూర్తి
మంగళవాత్సల్యమయ పితృమూర్తి
నీమూర్తి లోపల నే నాకుఁ జూచి
నా ప్రేమరత్నమా - సత్యంబు నమ్మ!

౭౮

నువ్వు రాచినయట్టి పసిఁడి రేకులను
బైఁడిగంటములతోఁ బద్యముల్ వ్రాసి
చదువులగని యైన సర్వజ్ఞమణికిఁ
గృతకృత్యతను గోరి కృతి నీయఁగంటిఁ;
బ్రత్యక్షరమునందుఁ బ్రణయరసంబు;
ప్రసరించెనో లేదో పరికింపుమంటి
హృదయంబు గ్రహియించు నింగితజ్ఞునకు
విన్నపంబు లిఁకేల విబుధరత్నంబ!

౭౯

నవనిధు లర్పింప నావల్లఁగాక
నవరసంబులు నింప నాచేతఁగాక
నవరత్నములమూట నామూట గాక
నవరాత్రిదీక్షలో నాశక్తి కొలఁది
నేనుగూర్చినయట్టి యీపద్యరత్న
హారంబుఁ గానుకగా నందింప నంది
నామాట లాలించి నాచేఁత లెంచి
నాప్రేమరత్నమా నవ్వుచున్నావె!

౮౦

ఒక్కొక్కవిధముగా నూహఁ గావించి
[illegible]

నిత్యనిర్మలమైన నీమూ_ర్తిలోన
నఱువదింటిని గంటి నానందకళల;
ఈలీల నీలీల లెన్నెన్ని గలవొ
కన్నులు చల్లగాఁ గనఁగొనఁగోరి
నినుఁజేరి నామది నినుఁ చేర్చుకొంటి
నభిమతంబును దీర్పు మమృతరత్నంబ!

౬౧

నీవు గల్గినచోటు నిధు లున్నచోటు
నిర్మలం బగుచోటు నీవెల్గుచోటు
నిత్యనూతనవేల నీకళాలీల
నిత్యసత్యస్ఫూర్తి నీదివ్యమూర్తి
నిత్యపవిత్రంబు నీచరిత్రంబు
నిత్యకళ్యాణంబు నీపురాణంబు
సుగుణరత్నమ! నీకు శుభమౌనుగాక!
విబుధరత్నమ! నీకు విజయమౌఁగాక!

# భావసంకీర్తనము

## అవతారిక

ప్రాభవాత్మ యందుఁ బ్రణయశ్రుతుల యందు
ముగ్ధ జీవ భావమురళి మ్రోఁగి
సరస భక్తి భావ సంకీర్తనంబయి,
విశ్వవీణ మేళవించుఁ గాక!

నా భారతి తన మనసువచ్చిన పసిపాపలఁ గూడి
తొక్కుపల్కులను బల్కుచున్నది.
తనయీడు చిన్నిబిడ్డలఁ జేరి
పదములఁ బాడుచున్నది;
తన చెలికత్తెల నెల్ల దగ్గఱఁ జేర్చి
యోమనగుంట లాడుచుఁ బ్రొద్దు గెంటుచున్నది.
ఎరవు బొమ్మలఁ దెచ్చి పెళ్ళిళ్ళలో
గుజ్జెనగూళ్ళను గూర్చుచున్నది.
ఎపుడీచాల భారతీదేవియే యనఁగఁ బలుకునో—
పరాత్పరుఁ బొగడునో—
జగమ్మె బొమ్మరిల్లుగ నాడఁ గలుగునో
అపుడు పితామహుఁడే యయిపోదును ప్రభు!

శోధించిన కొలఁది సొంపు పెంపగు చున్నదియుఁ,
దలంచిన కొలఁదిని దగులు మిగులు చున్నదియు,
వాడుకొను కొలఁదిని వన్నె కెక్కు చున్నదియు,
గ్రహించిన కొలఁదిని గలకలఁ గళఁ దేఱుచున్నదియుఁ,
గదలిచినకొలఁదినిగలుపువలపుఁ దెలుపుచున్నదియును
నిలిపిన కొలఁదిని నిండుచందురుంబోలు నిగ్గుజగ్గుతో
వెలయు చున్నదియు నగు నా విశుద్ధ భావనుమము,
నా జీవసంజీవనుమచ్చు,
మీాఁదుఁ గట్టి యుంటిని నీ వినోదమునకు!
ఎపు డనుగ్రహించెదవో? నీ యిష్టము ప్రభు!

ప్రారబ్ధ మగు నా సుమాపణమ్మున,
వాసనాకుసుమమ్ము లనేకములుగ నమ్మివైచితిని;
చిత్రమ్ములును, వివిధకర్మదోహదములుఁ
గౌతుకములు నైన పుష్పమ్ముల నమ్మివైచితిని;
సంచితములును, రసశోభితములు నగు
మృదులతాంతముల సమ్మర్దమున నమ్మివైచితిని;
సరమ్ములుఁ జిత్రకంచుకములు, నంగీలు,
నుష్ణీషకములుఁ జెల్లె;
ఒకపవిత్రప్రాదజ్జమే యున్నదింక!
విలుచుకొనుమయ్యా! దీని నా వెలయొసంగి,
వేగనాయంగడిని నెత్తివేయుదుఁ బ్రభు!

గురువులయొద్ద నక్షరములు దిద్ది,
మాటలు నేర్చి, బహుకోశములు స్పృశించి,
పెద్దల నేర్పులు పెక్కులు తిలకించి,
తలఁపుల గరువంబు దాండవింపఁ,
గరమునఁ గలమంటి, కల్పనంబులు సేసి,
నేర్చిన పద్యముల్ మార్చి కూర్చి
కవి ననుకొంటిని గాని,
వాక్కులకును, జిత్తంబునకుఁ గూడఁ జేరరాని
నీ గుణంబుల, నిన్ను, వర్ణించు తెరువుఁ గాన నేరక
నా పరికరములెల్ల మూటఁ గట్టి,
కరమ్ములు మోడ్చియుంటిఁ,
గవిని గానిఁక దాసుఁడఁ గాఫుతు ప్రభు!

౫

కుక్క-గొడుగుక్రిందఁగూర్చుండి, ఛత్రాధిపతిననుకొని,
జడి బడలువడితి; చలి ముడిగితి; వడ సడలితి;
కుమ్మరిసారెపైఁజేరి,భూచక్ర మెల్లనాయధీనంబనినమ్మి,
దండధరుండనై, కన్నుఁగానక యలజడిఁ బడితిని;
మేను దెలియక త్రిప్పులు బడితిని;
నా రాచరిక మెల్ల నాశనమయి పోయినది;
నా యహంకారభ్రాంతి ముడిగి పోయినది;
గొడుగు ముడిగి పోయినది;
కులాలచక్రంబు తునియలై కూలి పోయినది;
అధమమర్త్యుఁడ నని నేఁ దరసితిఁ బ్రభూ!

౬

అణువు బ్రహ్మాండ మానని తెలిసికొని,
అణుస్వరూపమునఁ గన్నులఁ బడిన
యిసుక కుప్పగాఁ గూర్చి,
యొకయింత తడిచేసి, మిద్దెటింటిని వినిర్మించుకొంటి;
దానికిఁ దొమ్మిది ద్వారంబు లుంచు కొంటి;
అది సతంబని యనఘమయిన నా రత్న
రాజమందే రహస్యమ్ముగ నొరులకుఁ దెలియరాకుండఁ
దాఁచుకొంటి ననుచుఁ బరాకుగ నుంటి;
అంత నొచటిగాలిదొంగయొ కాని యిల్లుఁ గూల్చి,
కొట్టి నా జీవరత్నంబు నెత్తుకొని యదృశ్యుఁడయ్యె;
నా కర్మ మే నెఱుఁగను ప్రభు!

౭

నీయంత వానిని, నిజముగా నను జడమును జేసితివి!
సరె! మనసు తెచ్చిపెట్టితి వేటికి?
గిట్టనితనము గాకుండిన, దానికి మొండితనమ్ము,
దొంగతనమ్మును, దొరతనమ్మును, జగలంజెతనమ్మే
గూలంకషముగ మప్పి,
కనకమును, గొప్పరాజ్యంబును,గాంతామణులఁజూపి,
వింతనాటకంబు నాడింప నేటికి?
కడలనుండి నవ్వుచున్నావో?
చూచుచున్నావో లేదో?
తెలియనిది నీదు కర్మమో?
తెలిసి తెలియనట్టినాకర్మమో?
నిజమాడుము ప్రభు!

౮

నీనీడలో నుంటి; నీడ నే ననుకొంటి;
నీడ నేఁ గాదన నేరకుంటి;
నీడఁ జూచిన వాఁడ నినుఁ జూడ కుంటిని;
నీడలో నడకలు నేర్చు కొంటి;
నీడ యాకృతిఁ జూచి నిజ మనుకొంటిని;
నీ నిజంబు గ్రహింప నేరనైతి;
నీడతో మాటాడి నీమాట మఱచితి;
నీడమాటయు విన నేరనైతి;
నేను నీనీడ నౌదునో కానో యెఱుఁగఁ గాని.
యీ నీడవాఁడను గా నటంచు,
నీడ నాది గాదనుచును నిశ్చయించుకొంటి,
నీవాఁడ నే ననుకొందునే? ప్రభూ!

అతఁడు సాలీఁడు; రవ్వంతయు లేఁడు;
సన్నని నూలు దారంబు పెనిచి నాఁడు;
కొమ్మల నునిచి చిత్రమ్ముగ జాలమ్ము నల్లిబిల్లిగ
వేగ మల్లి నాఁడు;
అయ్యళీకాంబర మ్మావిచిత్రదుకూల
మత్తులఁ దనుపంగ సరసి, భ్రమసి,
యీఁగనై గాలిలో నెగురక,
యేదియో జుట్టుకొనఁ దలంచి, తుట్టునఁ జని
జాలమునఁ జిక్కి సాలీనిపాలఁ బడితి;
మోహ ముడిగితి; లోభంబు ముడుచుకొంటి;
యాతనాశోకజలధిలో నార్తనాదములఁ
బిలుచుచుంటి నీఁగ దేమోక్షము ప్రభూ!

౧౦

కమఠవిహారంబును, మకరభీకరంబును,
జలకరికరప్రోద్ధితంబును, నతహ్రాదగభీరమును
భంగసంగతంబును, దుర్గమగ్రావపూరితమును,
ఊర్మికాకల్లోల యుతమును,
శంఖసంకులమును, శఫరీవిఘూర్ణితమును,
పంకజాతఘనవిభ్రమమును,
బంధురశైవాలపటల సంసక్తము
నగు, ప్రకృతికామినీరూపతరంగవార్ధిఁ జిక్కి,
నాజీవనౌక విశీర్ణ మయ్యె;
భావజప్రభంజనహతి భగ్న మయ్యె;
అగతికుఁడ నన్నుఁ బ్రోవు మీ యదనునఁ బ్రభు!

౧౧

రజనియా-నే జేయు ప్రార్థనము పెడచెవిం బెట్టి,
మెల్లగ వెడలి పోయినది;
దీపకళికలా-సదమల కాంతులం దొఱంగి,
వెల్లమొగముతో గనబడు చున్నవి;
మందిర మన్ననో-చెఱ్ఱం దొఱంగి చిన్నవోయిన
వగను దోంచుచున్నది;
చూడ, నాకన్నులలోనె బళ్ళుపం దెల్లవాఱి
పోయినది;
నీవు దరిసెన మీ్కయ కేనేంటుతలంగిపోయితివి గదా!
తలుపులు తీసిన వటులే
నిరర్గళంబులై యుండని, మైన నేమి?
కనులు మూసి,
నిను మదిలోం గాంతును ప్రభు!

౧౨

ఈ శిథిలనిశాంతమే నాకు యోగ్యమైనది;
నీవు రావల దిది యరిపరివేష్టిత మైనది;
శిష్టుల కిందుఁ బ్రవేశింప రాదు; దురాశచేత
స్వార్థాను భూతపిశాచములకు లోఁగి,
నిన్ను రమ్మను చుంటిని; దరిసెనమునిమ్మను చుంటిని;
నెమ్మది విడనాడి, నాకోస మీవు పరాకుగ నయినను
తెలిసికొని యైనను గనికరపడి యైనను, ఇట్టాలు మని
శ్రీపదాంబుజాతయుగము నిందుఁ
జేర్ప వలదు; నగవ వలదు;
గృహా మెడలి నేనె నిన్ను దర్శింతును ప్రభూ!

౧౩

ఈ దీనదాసునిపై దయ గల్గెనే!
వచ్చితే! దరిసెన మిచ్చితే! ప్రభు!
ఆనందబాష్పపాద్యము స్వీకరింపుము;
నామనఃకమలాసనమ్మున నుపవిష్టుండ వగుము;
విశిష్టభక్తిరసప్రపూర్ణవాక్సుమములఁ బూజఁగొనుము;
నాపుణ్యఫలముల నైవేద్యము గ్రహింపుము;
అంతరంగశుభనిశాంత మందుము,
భావసుమశయ్యా నలవోక పవ్వళింపుము-
ఆత్మవల్లకీప్రణవనాదామృతము ప్రియంబా?
జీవరాగప్రణయామృతము ప్రియంబా?
సెలవిమ్ము! నాసేవ లందుము ప్రభూ!

౧౫

నాప్రభూ! విన్నావె నామొఱ! యెన్నాళ్ళకుఁగరుణ!
దయసేయఁ గోరితి నని తప్పుగాఁ దలఁపకు;
దానగృహము ధన్యమైనది, అది గేహము కాని,
చూడు! నాబాష్పబిందులే నాకు శత్రువు లయి,
నామంగళాంగుని, నాత్రిభువనసుందరమూర్తినిఁ
జూచుకోనీకుండఁ, గన్నార మనసార గాంచకుండ,
నడుమఁ దెరఁ గట్టినవి;
నామనంబుగూడ నవశమైనది; మై జడ మయ్యె;
నిన్నుఁ గొలిచి, యర్చించి, మెప్పించుకొని నన్ను,
నెటుకో మాలిన నన్ను క్షమింపుము ప్రభు!

౧౭

పాలబుగ్గలఁ బసిపసినవ్వు నవ్వి నిన్ బిలిచితి
నానాఁడు పలుకనైతి;
ఎలఁబెదవులఁ దలతలనవ్వు నవ్వి నిన్ బిలిచితి
నానాఁడు పలుకనైతి;
కలికికన్నులఁ గలకిలనవ్వు నవ్వి నిన్ బిలిచితి
నానాఁడు పలుకనైతి;
జడత వీడ్చి కూరిమిచవిజాలు వాఱు నవ్వునవ్విపిలిచెద,
నీనాఁడు నీవు పలుక కుండఁగఁ గలవె?
నాప్రణయమూర్తి నగుచు నగుచు
నాతో నిజమాడుము ప్రభు!

౧౮

నాయక్షరనిధి యంతయును గృతఘ్న చిత్తుల
చేతఁ బెట్టి వ్యర్థుండనైతి;
నాపదభాగ్య మంతయు స్వార్థపరుల పాలొనరించి
ప్రాభవమును దొఱఁగితి;
నాయర్థశక్తి యంతయు దుర్మదాంధులచరణములనిడి
తేజ ముడిగితిని;
నాకృతిజాలమంతయు నహంకారదుర్మతుల కర్పించి,
దుష్కృతి నయితిని;
అక్షరపదార్థసుకృతికూపాత్ముఁడ నయి,
మోక్షమున కీవొసంగిన మూలధనము
నే నిరర్థకపఱిచితి;
నీఋణమ్ముఁ గొలువు సేయించుకొనితీర్చుకొనుమికఁ
బ్రభు!—

౧౯

సూనృతంబుగ నేఁడు సుఖమూర్తియే లేఁడు,
కష్టానుభోగలోకమున నాకు;
నిశ్చయంబుగ నేఁడు నచ్చెలియే లేఁడు,
సర్వమాయాప్రపంచమున నాకు;
సత్యంబుగా నేఁడు స్వామియే లేఁడు,
సర్వంసహావక్రచక్రమున నాకు;
తెల్లంబుగా నేఁడు దేశికుఁడే లేఁడు,
గాఢతమోభౌతికమున నాకు;
రూఢిగా నేఁడు కలవాఁడు లేఁడు నాకు;
ఉన్న-సౌఖ్యమో, స్నేహమో, తిన్నఁదనమొ,
గుఱియొ, భక్తియొ, నాయాత్మఁ గుదిరియుండకున్న?
యేలోక మందు నీ వుంటివి? ప్రభు!—

౨౦

ఈ గడ్డిపోచకా! యిష్టార్థము లొసంగు
నాకల్పవల్లిక నమ్ముకొంటి?
ఈ బొమ్మతాతికా! యిహపరంబులఁ జూపు
నారత్నదీపిక నమ్ముకొంటి?
ఈ గ్రుడ్డిగవ్వకా! యెల్లసిద్ధులఁ గూర్చు
నాపెన్నిధానంబు నమ్ముకొంటి?
ఈ పెంకుముక్కకా! యెల్లతృష్ణ లడంచు
నాసుధాకలశంబు నమ్ముకొంటి?
జీవకళ లేదు; హృదయంబు చిక్కఁ బోదు;
మాపయిన లేదు; గణియించు చోటు గాదు;
గిరివడి చెడిపోవుట యే నెఱింగి,
మిడుగుఁ బట్టితి, నన్నుఁ గాపాడుము ప్రభు!—

నావిశేషవిమోహభావసంగతులకుఁ
జిత్రంబుగా స్వస్తిఁ జెప్పినావు;
నాసమస్తారిష్ట నాటకప్రతతికి
భరతవాక్యంబును బలికినావు;
నాయపమృత్యుకాంతాశ్లేషగతులకు
నింతలో విడియాకు లిచ్చినావు;
నాఋణోద్రేకచింతాపత్రతతులకు
నిప్టై శ్రీరాములు చుట్టినావు;
శ్రవ్యదృశ్యకావ్యసంసారగతులలోఁ
జిత్రగుప్తజీవసిద్ధు లెల్ల
జెప్పిఁ జూపఁ జూప జెప్పఁ గురుండవై,
ఆత్మవిశ్వాసుకవి వైతివి ప్రభు!—

౨౨

అంతరంగంబుపై నల్గి చూచితిఁ గాని,
నీయంఘ్రియుగభక్తిఁ బాయదయ్యె;
బుద్ధికిఁ బలుమాఱు బుద్ధిసెప్పితిఁ గాని,
నీగుణచింతన నీఁగదయ్యె;
చిత్తంబునకు నెంతొ యొత్తి చెప్పితిఁ గాని,
నీనామకీర్తన మానదయ్యె;
భావంబుతో నెన్నొ బాస లాడితిఁగాని,
నీశుభాకృతి వీడనేరదయ్యె;
దుర్లభం బని చెప్పితి దోస మయ్యె;
నాయహంకార మీరీతి నాశ మయ్యె;
నింటిలోఁ బోరు పెట్టక యింక నైనఁ
బ్రేమమూర్తివై సాక్షాత్కరింపుము ప్రభు!—

౨౩

అంతరంగాకాశ మవికారమై యుండె,
ననుకూలభావపావనత తోచె;
ఆశలశుభకాంతు లందంద తలసూపె,
నానందబాష్పతోయములు నిండె;
తనువల్లి పులకాంకురనిదానమై యొప్పె,
సర్వప్రకృతి సుప్రసన్న మయ్యె;
ఆత్మవంశీప్రణయస్వర ముదయించె,
రాగలీలావిహారము సెలంగె;
జీవసాఫల్యకల్యాణచిహ్న లొదవె,
శ్రీపదాబ్జసేవాభాగ్యచిహ్న లొదవె,
శుభసమయ మయ్యె దయచేసి చూడుము ప్రభు!

## ౨౮

కాఁపుర మున్నది కంటకారణ్యము;
కామాది ఘోరమృగంబు లిందు,
స్వార్థాన్యవిపులగహ్వరములఁ దెఱచి,
నాజీవరక్తపలలాస్థికలఁ బట్టి,
పీలిచి, చీలిచి, పిప్పిచేసి, కబళించివయిచు చున్నవి
జీవశక్తి యాతనాసహితమై, చైతన్యరహితమై,
తెన్నెఱుంగక ముక్తి తెలివిఁ దొఱఁగినది;
కృపామతి దీని శాంతాశ్రమముగ వెలయఁజేసి,
యహింసకు నెలవుఁ జేసి,
ప్రేమమయజీవతప మిందుఁ బెంపుఁ జేసి,
సచ్చిదానందసిద్ధి నొసంగుము ప్రభు!

౨౫

తప మేమి చేసితిఁ? దన జన్మభూమిఁ
బాలించుకో లేక గాలించు కొంటి!
తప మేమి చేసితిఁ? దన యాత్మ పెంపుఁ
గ్రహించుకోలే కాగ్రహించు కొంటి!
తప మేమి చేసితిఁ? దన జీవగుణము
సాధించుకో లేక బాధించు కొంటి!
తప మేమి చేసితి? దన ముక్తిపథము
శోధించుకో లేక రోధించు కొంటి!
ఏమి తపముఁ గావించితి నెఱుక లేక?
తల్లివై, తండ్రివై, గుణదాత వగుచు;
గురుఁడవై, చెలివై, కృపాకరుఁడ వగుచు,
జ్ఞానమంత్రోపదేశ మొసంగుము ప్రభు!

౨౮

అభిమాన ముంతువే యుగ్రవర్ణుఁడ వని,
నెన రుంతువే మాననీయుఁడ వని;
విశ్వాస ముంతువే విద్యాధికుఁడ వని,
చన వుంతువే వాక్యచతురుఁడ వని,
ఆదర ముంతువే యర్థాధిపతి వని,
నేస్త ముంతువె భోగనిరతుఁడ వని;
ఆంతర్య ముంతువే యతిబలాఢ్యుఁడ వని,
విలు వుంతువే ధరాతలపతి వని;
ఈ యనిత్యపదవు లీ యధికారములు,
ఆత్మకర్మవశము లగుచు, తెగుచు;
తెగని భక్తియోగదీక్షాపరుఁడ,
నీకు నిత్యసాదరార్హభృత్యుఁడఁ బ్రభు!

౨౭

అరదంబు తను వింద్రియములు గుఱ్ఱంబులు,
మోహగుణము పగ్గములుగఁ జేసి,
మనసు సారథి కర్మమార్గంబునను వానిఁ
జిత్తంబు వచ్చిన చిత్రగతులఁ
గడువినోదంబుగ నడుపుచు నుండంగ
భావజాస్త్రం బెత్తి జీవరథికుఁ డాత్మలక్ష్యము విడి,
యహమహమికఁ బడి, తనుఁ దాన వేటాడుకొని
లయించు టెఱిఁగి, కర్మగతుల కెడఁబాటుఁ గనలేక,
జీవహింస నిట్లు సేయలేక,
ఆత్మభక్తియుక్తి నస్త్రసన్న్యాసినై యుంటి,
భవవిముక్తి నొసఁగుము ప్రభు!

౨౮

కలఁకఁ దేఱిన నాఁటి కన్నీటి తెరలలో
నీముద్దుపాటలు నేను వింటి!
కెంపుఁ దేఱిన నాఁటి కెమ్మోవిరుచులలో
నీనవ్వుపాటలు నేను వింటి!
మొలకఁ దేఱిన నాఁటి పులకాంకురములలో
నీసోఁకుపాటలు నేను వింటి!
వలపుఁ దేఱిన నాఁటి తలఁపువన్నియలలో
నీప్రేమపాటలు నేను వింటి!
మెచ్చి, మెప్పింపఁ గలయట్టి మేటి వయ్యుఁ
దెలిసి తెలియని తనములో నిలువరించి,
దాఁగ నేటికి? దయి వచ్చి, దరిసెనంబు నిచ్చి,
చనవిచ్చి, మనసిచ్చి యేలుము ప్రభు!

౨౯

అడుగుఁ గదపని మహావీరుఁడ నయి,
నాజీవిత ఘోరరణావనీస్థలమున నిలిచి,
నాబలము నేను శోధించుకొంటి;
రణక్షోణిఁ గోరికొన్న సాహసులు,
పగరఁ జంపి యీరాజ్యము, వారిచేఁ దెగటారి
స్వర్గరాజ్యము పడయుట నిజము;
మొగ్గరమున నేను,పగతుర నరికట్టి,బందులనొనరించి,
శాశ్వతభక్తిభరితమును, సుఖభరితమును,
బరమానందభరితము నగు
నీప్రణయరాజ్యపద మంది, నిన్నుఁ బొంది,
యిష్టసంసిద్ధిఁ గందు నీయింటనె ప్రభు!

౩౦

తనతల్లి తనకయి తాయ మేదియొ దాఁచి
ప్రేమతోఁ దన చేతఁ బెట్టి నట్లు! కరుణతో
నాకీవుగట్టిపెట్టినగుట్టుపుట్టువుఫలముపోఁ గొట్టుకొనక,
యిష్టమో, కష్టమో యెఱుఁగకుండ
ననుభవించుచునే యుంటి;
నించుకంతయుఁ దఱుఁగ దేమి!
ఱే పుండ దను భయముచే
నేనె తక్కువ చేకొని తినుచుంటినా?
యిది యైనచో వెంటనె నినుఁ బట్టుకొని
యేమి యైనను బెట్టుమని
పదింబదిగ నొంతునని నీవె దీని
నక్షయంబు చేసితివా?
నిజ మాడుము ప్రభు!

౩౧

శతశతకోటి విస్ఫారనేత్రములలోఁ
గరుణాకటాక్షిఁ దెఱచి నావు!
శతశతకోటి విశాలకర్ణములలో
నార్తిశ్రవణకర్ణ మంటి నావు!
శతశతకోటి విస్తారహస్తములలో
శరణాభయకరంబుఁ జాఁచి నావు!
శతశతకోటి విజ్ఞాతరూపములలోఁ
బ్రేమైకమూర్తిఁ జూపించి నావు!
విశ్వమూర్తివి నీవని, శాశ్వతుఁడవు నీవని,
సకలలోకాధినేత వీవని యెఱిఁగితి,
నిత్యకల్యాణు నిన్నుఁ దెలిసికొంటి, శరణంటి,
న న్నేలుకొను మిఁకఁ బ్రభూ!

౩౨

నీప్రకృతిరహస్యనిభృతచరిత్రంబు,
నే నెఱుంగని బాసలోన వ్రాసి,
నాకంటిలోఁ బెట్టి నావు;
నే దీనినిఁ జదివికొని గ్రహింపఁ జాల కుంటి;
నేఁటి పత్రమ్ములోని విషయ మెఱుఁగని నేను,
రేపటి పుటలోని దెట్లు తెలిసికొని గ్రహింపఁ గలను?
నిన్నటి దెట్లు జ్ఞప్తియం దుంచుకోఁ జాలుదు నిఁక?
ఈ రహస్యపుస్తకము నా కెందు కిచ్చి నావు?
దీని నెఱుఁగు సూత్ర మీవు దాఁచి నావు;
దానిని నాకిమ్ము; నాఁడె నీ ప్రకృతి నెఱిఁగి,
నిన్ను సేవించు టెఱుఁగుదుఁ బ్రభు!

33

నాబుద్ధియె నిదర్శనముగ,
నాభావములే నిదానములుగఁ
గాన వచ్చు నాకర్మఫలరూపమే
కదా నాభౌతికచరిత్ర!
నే దీని రచయిత నయి యుండఁగాఁ
గొందఱు పండితు, లిది విశ్వకోశము
నుండి గైకొంటి నని
వచించు చున్నారు;
నా సంచితకృతి కీవు కర్తవా ప్రభు! కావు; కావు;
దీని యెల్లస్వాతంత్ర్యములు నావియే యయినను,
గర్తగా మాత్రముండి నిక భర్తగా నొనర్తు;—
సంపూర్ణకరుణతో నాకృతిని గ్రహింతు వేని,
తప్పక నేఁ దరింతును బ్రభు!

38

నాకున్న బాధ మనవి చేసికొను చుంటి—
నోరు మూఁగది గాదు- నుడువఁ గలదు;
కన్నులు గ్రుడ్డివి గావు- చూడఁ గలవు;
చెవులు చెవిటివి గావు- వినఁ గలవు;
కరములు మొండివి గావు- చేయఁ గలవు;
కాళ్ళు కుంటివి గావు- కదలఁ గలవు;
నెమ్మేను శక్తి లేనిది గాదు- తిరుగఁ గలదు—
మన సొకటే విలక్షణముగ—
మూఁగ, గ్రుడ్డి, చెవిటి, మొండియుఁగుంటియు నైనది:
వికలాంగుఁ డైతి, దీని వింత తెగులు మాన్ప వెజ్జవై
నీపాదభక్తిరసము నిమ్ము బ్రతుకుదుఁ బ్రభు!

౩౪

భువనంబులం దెల్లఁ బురుషవాచ్యుఁడ వీవె,
జీవులఁ గాంచి పోషింతు వీవె;
దురహంకృతిని నేనె పురుషుండ నని
యెవ్వఁ డేనియు వాదింప నేల చెల్లు?
నీకళామాత్రుఁ డేనియు వాని కల్ల
రక్షణశిక్షణంబుల శక్తి కలదె?
భర్త వీవఖిలంబు భరియించు కతమునఁ
బ్రకృతు లెల్ల భరింపఁ బడుట వలనఁ
బడఁతు లగుట స్వభావము,
పడఁతు లెల్ల నీకు భక్తు, లీశ్వరుఁడవు నీవు,
నాకుఁ గుడియెడమలతోఁ బనిలేదు;
గుట్టెఱింగి భక్తి సేవించుకొనుటయే పని యికఁ
బ్రభు!

౩౬

నానిత్యజీవనమైన యీ వ్యవసాయమును
నేను విడిచి యుంటిని;
తరతరముల నుండి నాపూర్వపురుషు
లీవ్యవసాయమునె నమ్మి, పురుషార్థములను
బొంది నట్లు తెలిసికొని యీ యుత్తమప్రవృత్తి
నవలంబించితి;
తెలియని తనమునఁ దరుణము తప్పినను వెనుదీయక
నా చవిటిమనసు సలఁగ దున్ని,
చాల నమ్మిక విత్తులు
చల్లితి నీఁట;
నీ సెనరు మంచినీటిని నింపు మింక;
భావ మిగురించి, సస్యమై భక్తిపంటఁ బండు,
నీపేరి మీఁదుగాఁ బ్రదుకుదుఁ బ్రభు!

32

నా కంటిలోపలనే కరకరప్రొద్దు పొడుచు చున్నది,
క్రుంకి పోవు చున్నయది;
నెల తేలుచున్నది, నీట మున్గు చున్నది;
చుక్క తోఁచు చున్నది, మఱింగి పోవు చున్నది;
సంజ పుట్టు చున్నది, సాఁగి పోవు చున్నది;
కంటఁ బొడిచి నట్టిదంతయుఁ బోవు చున్నది;
దినమును సుడివడిన వాని తిరుగువడినె పోవుచున్నది;
తల తిరిగిపోవు చున్న యిట్టి దినములో నేల?
తిరుగని దినము నిచ్చి,
దినము నీపాదసేవలోఁ దిరుగ నిచ్చి,
నిత్యనిర్మలానంద మందింపుము ప్రభు!

౩౮

ఆశతో మూసిన యత్నులు దెఱచితి,
ఆశతోఁ దడఁబడు నడుగు లిడితి;
ఆశతోఁ దెలియని వగు మాట లాడితి,
ఆశతో జతగూడి యాడు కొంటి;
ఆశతో మనసార నాలకాపరి నైతి,
ఆశతోఁ బరువిడి యడవిఁ బడితి;
ఆశతోఁ గలకాల మాశలఁ దిరిగితి,
ఆశ ముట్టంగ లే కార్చు చుంటి;
ఆశ కంతంబు లేదను టరసి కొంటి;
ఆశకై వేఁడుకొను చుంటి, నాశఁ దీర్చు నాశ
నీపదపద్మసేవాశ నిమ్ము;
ఆశ దీఱ సుఖింతు నీయడుగులఁ బ్రభు!

కీర్త.

నిజముగా నేదియేని మహాపరాధము
చెప్పరానిది నేను చేసి యుందు;
కనుక నే నీకటాక్షములు నాపైఁ బ్రసరింప వైతి;
మొఱాలకింప వైతి;—
చేసిన తప్పునే చేసికొందునో యేమొ!
త ప్పేర్పరింపని దండనమున! భయ మేమి?
నామహాపాపము రూపింపు, మరి శిక్ష కైన
నే నోర్చు కొందు—
నీకటాక్షము లురు లగుఁ గాక నాకు,
అంత్యమున నైన నేనిది యడిగి కొందు,
వినియు వినకుండ నపుడు కాదనఁగ లేవు,
నీ కపుడు ప్రాణ మీకుండ నేరను బ్రభూ!

౪౦

నా ప్రతిజ్ఞ
సకలాంతర్యామి వైన స్వామికి
నేను విన్నవింపక తెలియదె?
సర్వజ్ఞుఁడ వగు నీ సన్నిధానమున
నించుకయిన నేను దాఁచుకొనఁ గలనె?
ఉపవాసబలములో నోర్పులోఁ బట్టితి
నన్యాన్నము గ్రహింప నట్టి నియతి;
కనుపెట్టుకొని యుందుఁ గల్పాంత మైనను,
గాచి యుందు మఱెంతకాల మైన!
ఆఁకలిని బెంచు నరసాన్న మడుగ నింక!
ఆఁకలి హరించు నమృతాన్న మడుగ నింక
నిత్యరుచిసుఖ మందించు
నీకృపాన్న మడిగి కొందు
సత్యానంద మైనది ప్రభు!

౪౧

పుట్టుఁ జీఁకటి దారిఁ
బోఁ బోవునాఁడు దీవించి చేదివ్వె నందించి నావు!
కడుపు బాటనో! కాక కుడుపు వేటనో!
కాక మడఁపుఁ దోఁటనో! దాని మాట మఱచి,
మొలఁ జుట్టి, తలఁ జుట్టి, వెలిఁ జుట్టి, లోఁ జుట్టి,
మఱపుఁ జీకట్లు నామనసుఁ జుట్టి,
మఱచి పోయితి నన్ను! మఱచి పోయితి నిన్ను!
మఱచి పోయిన మాట మొఱుఁగ నైతి!
కొఱవిదయ్యాలు గాఁబోలు,
మెఱుపు దివటీఁ బఱపి వెఱపించె,
నంతలోఁ దెఱపు మఱపుఁ గల పలుకరించె!
నీకూర్మి తొలకరించె!
నేను గంటి నాదివ్వె నాలోననె ప్రభు!

౮_౨

నేను మెలఁకువలో నిన్నుఁ జూడఁ దలఁచుకొనలేదు;
నిద్రలోఁ గూడ నీతలంపే యెఱుఁగను;
మెలఁకువయు నిద్రయుఁ గాని
స్వాప్నావస్థలోన మాత్రము
తెలుపు మఱుపుల మూల సందులలోఁ,
గనఁబడి కనఁబడని నాతలఁపుఁ దెరల
నిన్ గనుంగొని పులకితాంగుండనై
నాపుట్టునకు ముందు చూపును,
వెనుకటి మొదటిచూపు నైన నిక్కంపుఁ దెలిసినంది,
నాకును నాలోక మంతటికిని
మూలపురుషుఁడ వీవని తెలుసుకొంటి;
ఇది యథార్థము! మాయ నాకేఁటికిఁ? బ్రభు!

౪౩

జగమెల్ల నీప్రేమసామ్రాజ్యమే కదా!
నే నందు పౌరుఁడనే!
సమస్తజీవులు నీప్రేమచిహ్నమును ధరించి,
నీప్రేమశాసన నియమములను బాలించు చుండఁగాఁ
బరికించు చుండియు,
నాబుద్ధిదోషమునఁ దెలిసికొనఁ జాలక,
విషయవిలోలుఁడనై,
యపమార్గమునఁ దిరిగి భ్రమను వడితి;
అగతికుఁడ నైతి;
దీనజనావను నిను శరణు వేఁడితి;
నాయెడఁ గరుణఁ జూపి,
ప్రేమమూర్తివై నీప్రేమ భిక్ష నొసఁగి,
నీప్రకృతి గన్న నన్ను మన్నింపుము ప్రభు!

౪౪

నా కీమహార్ణవ మాకల్పన మొనర్చి నావు!
కాయక్లిష్టజీవసాగరంబున, నేను
మీనంబనై, ప్రత్యహమును విహరించు చుంటిని;
కనుకలి నచటి యంతఃకల్మషాసురావళి
భోగమత్తేంద్రియావళి నొత్తి యొత్తి,
శోధించి, శోధించి,
శూన్యభోగంబుల నుండి మరల్చుచు నుంటేఁ గాని,
కాయ మెపుడు భోగార్థమే కాచి చూచు;
భావ మెపుడు భోగార్థమే ప్రాఁకు లాడు;
వాని యనుభవ మిఁక వాని కౌను గాక!
నాకనులు మూయఁ జాల వెన్నటికినిఁ బ్రభు!

౭౫

నాకు ధనంబిచ్చినావు గైకొన్నాను,
కలిమిలేముల కీవె కలిమి వగుట;
నాకు ఘనత నిచ్చినావు గైకొన్నాను,
కొలఁదిగొప్పల కీవె కొలఁత వగుట;
నాకు సౌఖ్యము నిచ్చినావు గైకొన్నాను,
సుఖదుఃఖముల కీవె సురఁటి వగుట;
నాకుఁ దెలివి నిచ్చినావు గైకొన్నాను,
స్మృతివిస్మృతుల కీవె సీమ వగుట;
నాకు మానాభిమానబంధనము లేదు,
నాకు రాగవిరాగచింతనము లేదు,
ఏదియును లేదు,
కర్తవై యీయఁ బుచ్చుకొంటిఁ;
బుచ్చుకొన్నది యిచ్చుకొంటిని ప్రభూ!

## రక్ష

కనులకు మనసునకును గలయిక కలిగి నటులే,
మనసునకును దలఁపునకును సమావేశ మయినది;
భావము భక్తితో మేళవించి
ప్రేమామృతస్వరూపుఁడ వగు నిన్నుఁ,
జూపులలో నింపుకొనుటకు,
మనసులో నెనపుకొనుటకుఁ,
దలఁపులో నిల్పుకొనుటకు,
నిత్యసంకీర్తనములఁ గులికించి, పలుకరించుటకుఁ,
బదసేవఁ దీరిచికొనుటకు,
నీ నెనరుఁ జూపులోపలనే కరంగి పోవుటకుఁ
బ్రాణ ముప్పొంగి పోవు చుండె,
నే మనఁగ నేర నింక, నన్నేలుము ప్రభు!

౭౭

ఓ పురుషోత్తమా! నీపరమపవిత్రమూర్తిని
నా భావమునఁ గనుఁగొని, నేను నిన్ను వలచి,
నీ పాదపద్మసంసేవ సేయ నభిలషించుచుంటి;
నీవు ప్రేమానందనిలయుఁడ వని విని యుంటిని;
నన్ను నీవున్న దివ్యసౌధమునకు నొక్కసారి రానిమ్ము!
నాసత్కృతు లొకసారి సాఁగ నిమ్ము!
పిదప నన్నెటు మఱచెదో?
నాప్రణయకీర్తనముల నెటు మఱచెదో?
నాయనంతభక్తి నెటు మఱచెదో?
భవదుదారకరుణ నెటు మఱచెదో?
అడిగి యేఁగుదుఁ బ్రభు!

౮౯

పూనిక వ్యర్థమైపోవు చుండుటఁ
జెడిపోయిన దంతయుఁ బొందు పడుట,
తలఁచుకొన్నది కాక తాఱుమా అగు చుంట,
నాసైన లేనిది యగుచు నుంట,
నీరస మైనది సారస మగుచుంట,
బలయుత మైనది బ్రద్ద లగుట,
గుణ మవగుణముగా గోచరించుచు నుంట,
సేఁగి మంచిగ మార్పుఁ జెందు చుంటఁ
జూడఁ బౌరుషమున కింత చోటు గలదె?
సర్వమును నీయధీనమై సాఁగు నాఁగు,
సకలజీవకర్మక్రియాస్వామి వీవు!
నీవిచిత్రలీల లెఱుఁగ నేర్తునె ప్రభు!

౪౯

ఇపుడు కరుణఁ జూపు టుపకృతియా యన్న
నాచూపు నీకు మాంద్య మనఁ బోకు;
ఇపుడు పలుకరించు టుపకీర్తియా యన్న,
నాపల్కు నీకు సంధ్య యనఁ బోకు;
ఇపుడు దర్శన మిచ్చు టుపరూపమా యన్న,
నారూపు నీకుఁ జింత్య మనఁ బోకు;
ఇపు డాశ్రయం బిచ్చు టుపవర్గమా యన్న,
నాచోటు నీ కరణ్య మనఁ బోకు;
మందమతి నైతి; స్వార్థంబు మఱవ నైతి,
నిన్నెఱుఁగ నైతి, నిలువంగ నేరనైతి,
ఆలకించితిఁ గలల నీలీల లెల్ల,
దెలిసి భజియింతు నీ కోర్కెఁ దీర్పుము ప్రభు!

౫౦

'ని ర్ధైనను జేత లేని యీసమయము నందును,
నేను ధనాఢ్యుని వలెనే ధైర్యగరిమతో
నిలిచి యున్నాఁడను;
డంబము నూపి లోకంబు నెట్లయినను
మోస మొనరింప నగుఁగదా యని కాదు;
నాతో నొక కాసు వెంటఁ దేని నే నిప్పుడు,
దానికై పరితపించుట యెందులకు?
దానిఁ జూతునేని, పోవు నపు డది
నాతోడ రావలవదే?
అది వలదు నాకు;
శాశ్వత మైన భక్తిధనము గడియించు కొంటిని;
దానితలఁపులో నినుఁ గొలుతు,
నాకేమి లోపము? ప్రభు!

౯౧

కనులార నిన్నుఁ గన్గొనఁ జాల కుండిన
వా రగోచరుఁ డనినారు గాని,
నోరార నిన్ను సన్నుతి సేయ నేరని
వా రవాచ్యుం డనినారు గాని,
మనసార నిన్ను వర్ణన మొనర్పఁగ లేని
వా రతీంద్రియుఁ డనినారు గాని,
తలపార నిన్నుఁ జింతన సేయ నోపని
వా రచింత్యుం డనినారు గాని,
భువనసుందరాకారప్రబోధు నిన్నుఁ,
బ్రేమభావభవానందధాము నిన్నుఁ
గాంచి లాలించి, మేలెంచి,
కలసి మెచ్చు భక్తులకు నీవు
కంటిలోఁ బాపవు ప్రభు!

గీతి

కొమ్మయే మాయమ్మ,
క్రొవ్విరియె నేను,
వృంతమే నాకుఁ బ్రవృత్తిపదము,
అకరువే నాయాత్మ కాధార పీఠంబు,
కేవలమ్మగ రజమే విభూతి,
చుట్టుదళమ్ములే శోభనాంగకములు
కళుకులే నాలోనఁ గల బలమ్ము,
సిద్ధమధురసమ్మె జీవప్రసారమ్ము,
నాకు వాసనయె జన్మంపు పొక్కు;
నన్నెఱింగి, ప్రణయనాదంబుతోఁ జుట్టి,
జోలపాటఁ బాడి, చొక్కు పెట్టి,
భ్రమరమూర్తి వగుచుఁ బరమానుభూతి
నాయింట విం దనుగ్రహింపుము ప్రభు!

## ౫౩

పిలుచుచున్న కొలంది పెడదారిఁ బట్టుచుఁ
బ్రేమఁ జూపక యేడిపింతు వేని,
నిష్ఠురం బగు దాన, నీయడుగుల యాన,
భక్తవత్సలుఁ డను భద్రబిరుద మది యసత్యం బని,
యంతటఁ జాటింతు, నాకాశ మంత దప్పిల్లఁ జేసి;
గాలినై పరువెత్తుఁ, గిరినై మొనమ్ముట్టు,
నీరయి ప్రవహించు, నిలువఁ బోదు,
పలుకు వడిన నాప్రపంచంబు లోపలఁ
బదము లాడునె? యిఁకఁ బాఱిపోవ,
భక్తిపాశములను బఱచితి నెల్లెడఁ
జిక్కలేటికి? దయ సేయుము ప్రభు!

౫౮

స్థైర్యమూ లేదు;
విశ్రాంతియూ లేదు;
నాజీవిత మిపుడు స్వభావచంచలం బై నద్దై,
విశలం బయి యున్న ది!
గాలిలో దీపంబుఁ బోలి యున్నయది!
నేను చేసి కొన్నది తీర్చు వార లెవ్వరును లేరు;
కనుక వగపుఁ జెంది నిన్నుఁ బ్రార్థించితిని;
తలంచుకొను నెడ నీచింతలోఁ గరుణింపఁ గలవు;
ఈ వనుగ్రహింతు వేని, స్వస్థతఁ గాంచి,
ప్రకృతివాయు వేగ వికృతిఁ బడకఁ
దివ్యమైన రత్నదీపిక నై యుందు
నీగృహంబు నందె నిత్యము ప్రభు!

౫౫

సత్య మగు నదే నాసంకల్ప మగుఁ గాక!
నిత్య మగు నదె నానిత్యలక్ష్య మగుఁ గాక!
నిశ్చల మగు నదె నాతలఁ పగుఁ గాక!
శాంతమౌ నదియె నాస్వభావం బగును గాక!
పావన మగు నదె నావృత్తి మగుఁ గాక!
నాశరహిత మగు నదె నాకృతి యగుఁ గాక!
సుఖ మగు నదియె నాజీవిత మగును గాక!
ఆత్మ కనుభవయోగ్యంబు లైన ఫలము లన్నియును
నిట్లు నాకోస మైన యపుడు,
ఆది యందె కా కంతంబు నందె కాక,
ఆదిమధ్యాంతముల నీవె యగుదును ప్రభు!

౫౬.

చీకటియు వెలుఁగుఁ గాక యున్న తెలిపిలోఁ
గన్నుఁ దెఱచి,
నాలోకచిత్రసౌందర్య యవనిక ముందు నిలిచి
చూచుకొంటిఁ;
దమస్సు నాకంటి నుండి జాఱి నంతనే,
నాయుమస్సు నాకన్నులఁ బడినది;
అదిగో! నాపక్షుల మొలఁకువపాట లల్లన
శ్రవణగోచరములై నన్ను నాకుఁ దెలుపుచున్న వి; సరే,
నీవు ముందెక్కడనో లేవు;
నావెనుకనె, నామనసు వెనుకనె యుండి,
నాతలఁపున నీసహస్రసహస్రవినిర్మలకిరణములఁ
ద్రిప్పెదు!— మేలుకొన్నాఁడను ప్రభు!

౫౭

మెలఁకువలోఁ గల గలలో మెలఁకువయుఁ
గను చుంటి నని యనుకొను చుంటి;
నిద్రలో మాత్రము నే నేమి కనుచుంటినో
నాకు స్ఫురియింప కున్న దేమి?
మెలఁకువ గలలలోఁ గలవరపా టేమి?
కలమెలఁకువలలోఁ గలఁత యేమి?
ఆత్మసాక్షిగ నివి యున్నయును గలలే!
నిద్ర యొక్కటియె నా నిజ గుణంబు;
సాహసోద్భ్రాంతు లివి యెల్ల నాటకములె;
మనసు నా సుషుప్తిని లేదు;
మాయ లేదు;
మనసు లేని, మాయయు లేని మంచి నిద్ర నిచ్చి,
సుఖమిచ్చి నన్ను గ్రహింపుము ప్రభు!

౫౭

జవ్వఁడనై నేను చేసికొనిన తప్పు
జడమైన మనసుతో సాహచర్య మొనరించుటయె;
యది తన జాత్యభిరుచిని విడిచిపెట్టుకొనునా?
విచ్చల విడిగాఁ దనప్రకృతిలోఁ గలిసి తిరుగుఁగాని;
నిన్ను వెదకుటకై నేను
పంపుకొన్న దూతగ నెంచుకొని
మోస పోయితి;
తాఁ గనుఁ గొన్నవి తనవిగాక నా వగునె?
నిజ మెఱిఁగికొనంగ నేనె,
మనసుతో మంతనములను మాని,
దురభిమాన మెడలి,
స్వయంభాసమాను నిన్నుఁ దెలిసి,
కనుఁగొంటి జ్ఞానమందిరమునఁ బ్రభు!

౫౯

నీయిచ్ఛ లేకున్న, నేఁగోరి చేయు
కార్యంబు లన్నియు వినాశంబు లగును;
నీయనుగ్రహ మున్న, నిర్నిమిత్తంబుగాఁ
గోరని వెల్లఁ జేకూరు చుండు;
ఇది యనుభవసిద్ధ, మిది యపౌరుష మైన,
దిది పరమరహస్య, మిది నిజంబు;
నీవిధాన మెఱుంగ నేరక
నాకు నేనే కర్త నను నహంకృతిని జెడితి;
నాకు, నా కార్యముల, కెల్ల లోకములకుఁ,
గర్త వీవని తెలిసితి,
గర్వ ముడిగి, నాకృతుల, నన్ను నీకర్పణంబుఁ
జేసికొంటి, దాసుఁడ నన్నేలుకొను మికఁ బ్రభు!

౯౦

ఆప్తుఁడ వీవు నాయార్తిఁ దీర్పఁగ,
నిన్నుఁ గలసి చరించు సంగాతి నేను;
స్వామివి నీవు నాప్రేమఁ బెంపఁగ,
నిన్ను బరమభక్తిని గొల్చు బంట నేను;
నేతవు నీవు నానెలవు నిల్పగ,
నిన్ను నకపటమతిఁ గొల్చు ప్రకృతి నేను;
గురుఁడవు నీవు నాపరముఁ దెల్పఁగ,
నిన్ను విడువక కొల్చు శిష్యుఁడను నేను;
నాకు నీకు నింత యనుబంధంబు గలదు,
క్షణ మయిన నిన్ను విడువంగఁ జాల నింక,
నిముస మైనను నను వీడ నేర వింక,
వలుకొను మేను నీవాఁడనే కద ప్రభు!

౬౧

నన్ను దాసునిగఁ జేకొన్నావు;
నాపుట్టుపూర్వోత్తరములు, నాసర్వవిధులు,
నీచేతిలోఁ బెట్టి నిమ్మళపడితిని,
నీవినోదమునకై భావి నాకు
నేకీటభూమిక నిచ్చినఁ గైకొందు,
సర్వపతిత్వంబు నొకడ దక్కఁ;
దయమహాలి, దానిని ధరియింపఁ జేసిన
నేనే ప్రభుఁడ నని నిన్ను మఱతు;
చెవుల నమ్మికఁ గన్నులఁ జేటు గ్రమ్మ;
ఏలుబడికల్మిఁ గూరిమి యెంగిలి పడు;
మనసుపొగరున సత్యంబు మాయు,
నట్టి పాప మొడిఁ గట్టక ననుఁ గాపాడుము ప్రభు!

౬౨

ఆదిమధ్యాంతశూన్యంబై,
యనంతమై, శాశ్వతమై,
యగోచరము నైన కాలంబునకు, నీకుఁ
గల భేద మెఱిఁగింప,
మాపు రేపు ననెడి మంచి గుఱుతు దాపి,
నిన్నను నేఁడు రేపన్న సంజ్ఞల మూఁడు మెట్టులు
దాని మ్రోలఁ బెట్టి,
ప్రాణుల నామెట్లపై నడిపించుచుఁ
సూత్రధారుఁడ వయి చూతు వీవు,
నీయనుజ్ఞఁ బట్టి నేను నా మెట్లపై నడుతు,
నేండ్లు కొలఁది నడిచి యైన,
నేఁటి మెట్టు మీఁదనే యుందు నెప్పుడు
దీని చిత్ర మేమొ తెలుపుము ప్రభు!

౬౩

పలుకులోఁ దోఁచి నాయలుకఁ దీర్చినఁ జాలు,
నావెంట నుండు మనంగఁ బోను;
చూపులోఁ దోఁచి నాతాప మార్చినఁ జాలు,
నాకంట నుండు మనంగఁ బోను;
తలఁపులో దోఁచి నాకలఁకఁ దీర్చినఁ జాలుఁ
నాజంట నుండు మనంగఁ బోను;
మనసులోఁ దోఁచి నావనటఁ దీర్చినఁ జాలు
నాయింట నుండు మనంగఁ బోను,
నీకు నావంటి దీనులు లేకపోరు;
ఇట నిలువ వారి యార్తి యింకెప్పుడు తీఱు?
ఆఁగు మనఁ బోను, రమ్ము పొమ్మనఁగఁ బోను,
ప్రోచె చాలు నింకేమనఁ బోవను ప్రభు!

౬౮

నామనవి వినుము;
నా కున్న భయ మెడలింపుము;
నన్నుఁ బాలింపుము;
మును పెన్ని జన్మంబుల నెత్తితినో!
యప్పుడే నిన్నుఁ దెలిసి యైనఁ, దెలిసికొన కైనఁ,
భజియించుకొంటినో లేదో యెఱుంగ!
నాభాగ్యనియోఢి నేమొ,
యీ పుట్టువున భవతాపహార మగు
నీశ్రీచరణాబ్జసంసేవ సేయు భక్తి గలిగినది;
మఱెన్ని భవము లైన నిది విడక యుండ
నొక వర మిమ్ము నాకు;
ఎపుడు నీచిత్త మెఱిఁగి, నీకృపకు మరగి,
ఇందు నెందును సేవించు కొందుఁ బ్రభు!

౭౯

గట్టి ముత్తెపుఁ గోవఁ గావించుకోవె!
నాకన్నీటి బిందువులఁ గలయఁ బెట్టి;
నెత్తావిపూదండ నిర్మించుకోవె!
నా దీనంపు సుద్దుల దిద్ది తీర్చి;
పట్టు వింజామరఁ బట్టించుకోవె!
నా నిట్టూర్పు గాడ్పులఁ బట్టి కొలిపి;
కపురంపు టారతిఁ గల్పించుకోవె!
నా సంతాపవహ్నిని సంస్కరించి;
ఇన్నియును నీవు చేసికోకున్న మానె,
ప్రేమమూర్తివై సాక్షాత్కరింపఁ గానె,
సర్వమును నేనె యింతలో సంతరింతు,
నింత మాత్రంపుఁ జనవైన నీదగుఁ బ్రభూ!

౬౬

నీకన్న ఘనులు లేనే లేరు,
నీతో సమానులు లేరను మాట నిజము;
విశ్వరూపుఁడవును, విశ్వరక్షకుఁడవు నైన
నీవఖిలవిశ్వాత్ముఁడ వయి,
సకలవిశ్వమునకు సాక్షివై యుండియుఁ,
బ్రకృతి సంసారముఁ బాలన మొనరించు చున్నావు!
నీప్రేమను, నీయనుగ్రహమును గోరి
నేనహరహమును నిన్నుఁ బ్రార్థించు చున్నాను,
నీవు నాకుఁ దల్లి, దండ్రి, గురుఁడు,
దాత, దైవము నంచు
అతిరహస్యంబును, భవార్తిహరము నైన
నీమహత్త్వభావ మందింపుము ప్రభు!

౬౭

ఇంత వంచించుట యెక్కడి న్యాయము?
రేయుంబవలు నేను నీయనుపమదివ్యసుందరమూర్తిఁ
దెలిసికోఁ గోరి, తెలిసి, కొలిచికొన మనసుపడి,
వెదకికొనుచుండ, మొఱ యిడుకొనుచుండఁ,
బెడచెవిని బెట్టి తప్పించుకొనుట యేటి న్యాయము?
నీవు సుందరమూర్తి వని, గుణసుందరుఁడ వని,
నీ యందు నామనంబు నెలకొల్పి,
నిను నమ్మి నాఁడఁ గాని,
ఈ విరూపుఁడ వని, గుణాభావుఁడ వని,
యింత నిర్దయుఁడ వని నే నెఱిఁగి యున్న,
నెట్లు మన నుంతు?
నీవు నా కెందుకు ప్రభు!

ఉ॥

నలుగురి లోపల నామకీర్తన విని,
గురువుల లోపల గుణముఁ దెలిసి,
పెద్దల లోపలఁ బ్రేమగాథలు విని,
కులజుల లోపల గొప్పఁ దెలిసి,
సుకవుల లోపల శోభాకృతిని విని,
మహానుల లోపల మహిమఁ దెలిసి,
యోగుల లోపల యోగవదము విని,
జ్ఞానుల లోపలఁ జదువుఁ దెలిసి,
మనసుపడి, మెచ్చుకొని, కూర్మిపెనిచి, పొంగి,
మనన మొనరించి, నీలీలఁ గని వరించి,
కోరి, నన్ను నీకర్పించుకొంటి నపుడె,
యెపు డనుగ్రహించెదవొ నీయిష్టము ప్రభు!

౮౭

నాశరీరనికేతనమున నెచ్చట నుంటివో
నాకుఁ దెలియదు-కాని,
నిత్యమును నయమున భయమున
నీసదుపదేశముల నిచ్చుచున్నను మూర్ఖుఁడ నయి,
నేను వానిని విననేర కుంటిని;
కష్టనిష్ఠురఫలము లనేకములుగ
ననుభవించుచునె యుంటిని;
శ్రుతిహిత మైన నీప్రబోధస్మృతి నిల్చి నంతనే
పురాణరూపమగు నానిభృతజీవితేతిహాస
మిప్పుడు గ్రహించుకొంటి;
ఆత్మగురుఁడవు, నాయంతరాత్మవు నగు
నీకు శరణంటి ననుఁ గరుణింపుము ప్రభూ!

౭౦

మమతలు పోనాడి మనసు నీపై నిల్పి
నిన్ను నాలోన ధ్యానించు నంత;
నంతరాళములోన నలరిన పూవులో
షట్పదఝుంకృతిస్వనము దోఁచె;
పక్షుల యవ్యక్తభాషణంబులు దోఁచె;
విమలవిపంచీస్వనములు దోఁచె;
జీవప్రబోధవంశీరవంబులు దోఁచెఁ;
ప్రణయకళాపరంపరలు దోఁచె;
కోటికోటి చంద్రుల కాంతి గూడఁ దోఁచె;
అనుభవంబెల్ల నాదగు టపుడు దోఁచె;
అక్షరాత్మ వీవై యుండు టపుడు దోఁచె;
అద్వయానంద తేజ ని న్నరసితిఁ ప్రభూ!

౭౧

నాకు నీవిటఁ గనరాక పోయినను
జాటున నుండి యైన,
ముద్దునకు నైనఁ బలికింప కున్నను,
దెలిసిన పెద్దలు నీగుణగణము వర్ణించు నపుడు విని,
నిన్నుఁ గని నట్టి యనురాగ ముదయింపఁ
దలఁపున నీమీఁది వలపు నిలిపి,
తెలిసియుఁ దెలియని దీక్షలో నొక నాఁడు,
కొలము వారల కైనఁ దెలుప కుండ,
ఆత్మసాక్షిగ నంతరంగాలయమునఁ జెలఁగు
నీమూర్తి నేఁ బెండ్లి చేసికొంటిఁ,
బ్రియుఁడ వగు నీకె నను సమర్పించుకొంటిఁ,
జేసినది కాదనక దయసేయుము ప్రభూ!

౭౨

ఈయేఱు దాటగా నీ తేప గావలె
సుఖమునకై దీనిఁ జూడఁ బోను;
ఇది యొరవు పదార్థ మిది యన్యులది గాన
దీనితో నక్కఱఁ దీర్చి కొందు;
జ్ఞానరూపధనమ్ము సాధించు కొనుటకు
నా కీతను నొసంగి నావు,
దీని బడలు వడక యుండ నడిపింపఁ గోరుదు,
నీ పరోపకార నిరతిఁ జూపి;
కర్మముఁ దరించి, జ్ఞానమార్గము గ్రహించి,
వరుస నెవరి వస్తువులను వారి కిచ్చి,
భవము ముగియించు దాఁక నీ పాలనమ్ము!
అవల సచ్చిదానందు నిన్నుం దుదుఁ బ్రభు!

౭౩

నాయింటిలోని ధనము నాది;
వస్తువు లన్నియు నావి; నా వనుకొను నవి
యే నేల నాచిత్తవృత్తిని బట్టి వెచ్చింపఁ గూడ దని
వ్యయింప మొదలు పెట్టితిని;
ధనము పెట్టి వట్టి దయి పోయినది;
వస్తువులు చేయి విడిచినవి;
ఇల్లు గుల్ల యయి పోయినది;
మనసు తొట్రుపడి పోయినది;
తోడి వారి కింక నేమి యిచ్చుకొనఁగలనో!
యేది దారి! యనుచు
నిను వేఁడు నంతలోఁ గనికరించి,
ప్రేమనిధిని నాలోనె చూపించి,
నాఁటి నా వ్రతము సువ్రతముఁ జేసినాఁడవు ప్రభు!

౭౪

నిన్ను దెలియుటకు
నిన్నుఁ గొలుచుటకు,
నిన్ను డగ్గరుటకు,
నీ యనంగు భక్తుల కెన్ని యో పథము లేఱుపఱిచితివి
వారి వారి పుణ్యవశమున
నెవరికి దొరకిన త్రోవను బట్టి వారేఁగు చుందురు;
వారిలో నొక్కరైన, నిది నే సృజించుకొన్నది,
యీ పథ మొకటే నిన్నుఁ జేరుటకుఁ
గనుంగొనఁ బడెనని చెప్ప సాహసింపఁగలరా?
జిహ్వకు రుచిభేదము, మనమ్మునకు గుణభేదము
నను పలుకు నిజ; మందఱకు భక్తిప్రాపకంబు;
ఏ పథముఁ జూపి యిప్పుడు నన్నే లెదు? ప్రభు!

౭౫

ఎన్నియో గాథల నిన్నుంచి పిలువనే!
యొకదాని కైనఁ బలుకవు గాక!
వినరాని వేమైన వినుమను చుంటినే!
కొంచెపై యూఁకొట్ట కుంటి గాక!
ఊఁకొట్టి నంతనే వాకట్టి పోవునే!
పిలిపించు కొనుటయే బులుపు. గాక!
పిలువనే! జగముచేఁ బిలిపింప కుందునే!
పిలుపులో నీప్రేమ తొలఁకు దాఁక,
ఎన్ని గాథలఁ జెప్పింప నెంచినావో!
ఎన్ని బోధలఁ జేయింప నెంచినావో!
ఏ పిలుపులోన నోయన నెంచినావో!
ఏ నడుగఁ బోవ నింక నీయిష్టము ప్రభూ!

౭౬

పిలుచుట నాపని; పలుకుట నీపని;
పలికిన దాఁక నేఁ బిలువ కుందునే!
తెలుచుట నాపని; తెలివిలోఁ దేయుచుట నీపని;
కృపతోఁ జూచి తీర్పు వఱకు
నీయడుగుఁదామరల కెఱఁగ కుందునే!
కొలుచుట నాపని; చన వొసఁగి కూర్చుట నీపని;
కొలు విచ్చి ననుఁ గూర్చు నందాఁక
నాపూన్కి నాఁపుకొందునే!
వలచుట నాపని; నాస్వభావ మెఱిఁగి
నన్ను మనుచుట నీపని;
నామనుగడ చక్కఁబడు దాఁక
నీకూర్మి చదువు మానుకొందునే!
ఉన్న దిది మనసందునఁ బ్రభు!

౭౭

నేను ప్రసన్నుఁడ గాను;
మహత్తరభక్తియోగాభ్యాసపరుఁడఁ గాను;
జ్ఞాననిష్ఠుఁడఁ గాను;
సజ్జనసహవాస మైనఁ జేసిన వాఁడఁ గాను;
జీవదయ యన నేమో మొదలె విననైతిఁ;
బరోపకారఘనతయుఁ దెలిసికొన నైతి;
నీ వాఁడ నేనగుట యెట్లో యెఱుంగ నయితి;
నీవాఁడఁ గావలె నని యెందుకో కాని
నాయెదఁ గుందుచుంటి;
నే నీసుగుణములు లేకున్న నిందుకైన
నన్ను నీవానిగాఁ జేసికొన్నఁ జాలు;
నాకు నీకృప నన్నియుఁ జేకుఱుఁ బ్రభు!

౭౮

నా యొద్ద ధన మున్న నాఁడు
నేను పదిమందికిఁ బోషకుఁడ నని,
సుగుణపరుఁడ నని, తగవరి నని,
జ్ఞానవంతుఁడ నని, పలువురచే మెప్పు నొందితి;
నామహత్త్వ మని పొంగితిని;
ధనము తొలఁగినది;
నామహత్త్వము నను విడనాడి చన్నది;
నాది కానిది నాదిగ గర్వ పడితి నని గ్రహించితి;
నిపుడు నామనసుఁ బట్టి జాఱినది యేది?—
—నా యహంకారవృత్తి!
మిగిలినది యేది?—నీపాదయుగళభక్తి
ఎఱిఁగి సేవింతు నింక నన్నేలుము ప్రభు!

౭౯

ఒక యవస్థనె చూప నోపెడు చిత్రకారుని కంటెఁ
దత్కాలమునఁ గరంచు గాయకుని కంటెను
గల యవస్థల నెల్లఁ గల భావముల నెల్ల వెలయఁజేయు
కావ్యప్రపంచంబు కల్పించు సుకవియే
మూఁడు మూర్తుల నీకు మొదటి కొడుకు,
సృష్టించి, వెలయించి, చేతనాచేతనవస్తులఁ
దనలోనె వాల్చు నట్టి కవికులముఁ బట్టి,
భక్తుల కరుణఁ బట్టి,
నీకు దగ్గఱి చుట్టంబుఁ గాక పోను!
ఆ చనవు కొంత పాదదాస్యంపుఁ జనవు కొంత
చూపించి, నన్నేలుకోఁ దగుఁ బ్రభు!

౮౦

ఈనాఁటి కైన నీధ్యాన మూపినఁ జాలుఁ,
ప్రేమానుబంధంబుఁ బెంచి కొందు;
ఈపాఁటి కైన నీరూపుఁ జూపినఁ జాలు,
మాయాంధకారంబు మాటు కొందు;
ఇప్పటికైన నీ చొప్పుఁ దెల్పినఁ జాలు
సంసారబాధలు సైఁచు కొందు;
ఇన్నాళ్ళ కైన నీయింట నిల్పినఁ జాలు,
భవపరంపరలను బాపు కొందు—
కలఁతఁ బెట్టుచుఁ గలహూపుఁ గప్పికొనుచు,
బడలువఱచుచు, బాముల నుడివఱచుచు
నెంత కాలంబు దాఁక శోధింతు విట్లు?
ఇపు డయిన నన్నుఁ గరుణించి యేలుము ప్రభు!

౮౧

కని పొంగు చుండుటే ఘన మనుకొంటిఁ,
గాకున్న నా కేగొప్ప యున్న దింక?
విని యుబ్బు చుండుటే పని యనుకొంటిఁ,
గాకున్న నా కేకార్య మున్న దింక?
అని సేయ కుండుటే యశ మనుకొంటిఁ
గాకున్న నా కేకీర్తి యున్న దింక?
తిని మెచ్చ కుండుటే తీర్పనుకొంటిఁ
గాకున్న నా కే తెల్వి యున్న దింక?
చెడ్డ మంచిగ, మంచిని జెడ్డ గాఁగ
భ్రాంతిఁ జెంది యిహం బిట్లు బాపు కొంటిఁ
బర మెఱుఁగకుంటి, యిట్టి పామరుని నన్నుఁ
దీరిచి గ్రహించుటయె నీకుఁ గీరితి ప్రభు!

రాత్రి

ఇది కర్కశపు దిత్తి,
యీ తిత్తి లోపల ననిల ముండుటఁ జూచు
మంతె చాలు;
ఇది మొండి కట్టియ,
యిక్కట్టె లోపల నగ్ని యుండుటఁ జూచు
మంతె చాలు;
ఇది బండ తాగుట్ట,
యీ గుట్ట లోపల నంబు వుండుటఁ జూచు
మంతె చాలు;
ఇది మంటి సిరిబొమ్మ,
యీ బొమ్మ లోపల హంస యుండుటఁ జూచు
మంతె చాలు;
శ్రుతిహితంబుగ లోకంబుఁ జుట్టుముట్టి
శుష్కవాదుల శత్రువాచ్యాల దహించి,
సుగుణమణులపై నమృతంపు సోనఁ గురిసి,
ప్రేమమూర్తినై నిన్ను మెప్పింతుచు ప్రభూ!

౮-౩

తలఁపును బట్టి నీధ్యానంబుఁ గంటిని,
నీనామమంత్రంబునే జపించి;
నామంబుఁ బట్టి నీప్రేమంబుఁ గంటిని,
నీరూపసంపదనే స్మరించి;
రూపంబుఁ బట్టి నీడాపును గంటిని,
నీగుణగణములనే గ్రహించి;
గుణములఁ బట్టి నీకొలువును గంటిని,
నీనడవడి పెంపునే తలంచి;
నడకఁ బట్టి నిన్ను నాపతిఁ గాఁగంటి,
నీజగత్పతిత్వ తేజ మెఱిఁగి;
ఱెుుకలోని భక్తి యిచ్చితి,
నాభక్తి కోలఁది ఱెఱిఁగి యేలుకొను మిఁక ప్రభు!

౮౪

ఒక పత్రమైనఁ గానోపనైతిని గదా!
భక్తులు భజియించు పాలకునకు;
ఒక పుష్పమైనఁ గానోపనైతిని గదా!
విబుధులు పూజించు వేలుపునకు;
ఒక ఫలంబైనఁ గానోపనైతిని గదా!
యోగు లారాధించు యోగపతికి;
ఒక బిందువైనఁ గానోపనైతిని గదా
జ్ఞానులు సేవించు సద్గురునకు;
జడమగుదు నైనఁ బుణ్యహస్తములఁ జేరి
శ్రీచరణసేవలో ముక్తిఁ జెంది యుందు,
నట్టి పూజాఫలము పెట్టిపుట్ట లేదె?.
అంత మాత్రపుఁ జన వీయవైతివి ప్రభు!

రాగి

తల్లిదండ్రులును, సహోదరులుఁ జుట్టంబులు,
నిల్లాలు, బిడ్డలు, హితులు ననుచు,
ననుబంధములు పెట్టి,
యైహికసంసారశకటంబు నడిపించు స్వామి వీవు;
జీవుఁడనై నేను చిత్తానువృత్తి ని దాలుచు
మోహాబంధములఁ జిక్కి,
యేదియు విడనాడ నెఱుఁగకుంటి,
నెఱింగి, సతమనుకొని మనఁ జాలకుంటి;
ఎఱిఁగియు నెఱుంగ నట్టి నాకిట
విషాద మొకటై సకలానుబంధమై యున్న దిపుడు
దీనిఁ దరియింపఁగా నొక తెరువుఁ జూపి
దీనుఁడగు నన్ను నీకృపఁ దేర్పుము ప్రభు!

౭౫

కరుణాసముద్ర! నీకృపముఁ గంటి,
నీయనుగ్రహ మంటిఁ గష్టంపుఁ గలలఁ గంటిఁ
దెలివిఁ దెలిసికొంటిఁ, గల కోరికలు నావి గావు;
వాసికి లోను గాను;
వాహినీజలంబులు వచ్చి నింపు చున్నను
మహోదధి యవికారత నున్న యట్లు,
నానియంతృత్వంబున నే యవికారుఁడనై యుండి,
సర్వంబు నా యధీనమున మెలంగఁ జేసి,
మనసు నీపాదారవిందభజన మందె వెలయ జేసి,
నిన్ను దేశికునిగ నిఖిలార్థ సిద్ధిఁగా
నెఱిఁగి కొలుచు చుందు నేలుము ప్రభు!

౧౭

దేహంబు నడపు నింద్రియము,
లింద్రియముల నడపించు నదియె మనస్సు;
దాని పోకడ నరికట్టి బుద్ధి నడపు చుండు;
బుద్ధికి నాత్మయే పూటకాపు;
ఆత్మ నెఱిఁగి, పరమాత్మయౌపుని నిన్నుఁ దెలిసి
సకల కర్మములును నీకె యర్పణం బొనరించి
యాగ్రహాది వికారములకు లోఁబడక పోక
యలఘుభక్తి భావమున
నీపదాబ్జసంసేవ నైన కర్మ మొనరించి,
సాధుమార్గము గ్రహించి,
భవమహోదధి నీదయఁ బట్టి దాఁటి కొందు
నిన్ను నే సేవించు కొందును ప్రభు!

౧౦౭

కర్మము నాకు శృంఖల మని తెలిసియు
నిరతంబుఁ గర్మంబునే యొనర్తు;
తలఁచుట, చూచుట, తాఁకుట, నడచుట
యను నివి కర్మంబు లగుట నిజము;
కర్మంబుఁ దరియింపఁగల జీవియే లేదు,
కర్మఫలార్థి తాఁగాని నాఁడు,
జీవికి బంధంబు చెందదు గావున
నీకయి కర్మముల్ నేనొర్తు;
యాగయజ్ఞములకుఁ ద్యాగభోగములకు,
నాది భోక్త నైన యట్టి నీకె,
అఖిల కర్మ ఫలము లర్పించి,
సుజ్ఞానరూపు నిన్నుఁ జూడ నోపుదుఁ బ్రభు!

౮౯

సజ్జనగోష్ఠియు, సాధుసాంగత్యంబు
నిత్యకృత్యంబుగా నెఱప నిమ్ము;
సత్యంబులును శాస్త్రసమ్మతంబులు నగు
విధివాక్యముల గౌరవింప నిమ్ము;
సద్గురు నుపదేశ సారంబు గ్రహియించి,
చిత్తమం దతనిఁ బూజింప నిమ్ము;
ఆత్మతత్త్వ గ్రహణాతిశయంబున
నఖిలంబుఁ దానుగా నరయ నిమ్ము;
కార్యకారణ సంబంధగతు లెఱింగి,
ఆత్మవిశ్వస్వరూపు ని న్నరయ నిమ్ము;
ఇదియె నాజ్ఞాన మార్గమై యొసఁగ నిమ్ము;
అనుభవానందసిద్ధి నిస్నందుమఁ బ్రభు!

౯౦

కనుపెట్టి జగముల కాన్పులో నినుఁ గందు;
నిస్వనంబులలోన నిన్ను వింటు;
సద్వస్తువుల నిన్నె స్పర్శింతు;
సౌరభముల నీపరిమళములె గ్రహింతు;
పలుకులలోన నీపలుకులే భావింతు;
నడపులలోన నీనడలె చూతు;
సకలేంద్రియము లాత్మసంచారమున నుండ
నేనుందుఁ బరమాత్మ నిన్నుఁ గలిసి;
తమప్రవృత్తికి నేనడ్డు తగుల కునికి,
నింద్రియంబుల యడ్డు నాకింత లేక,
ప్రకృతిసంబంధ మింతమాత్రమె వహించి,
కర్మయోగినై నిన్ను నేఁ గాంతును ప్రభు!

౬౧

నిన్నన నేల? నేనే నాకు శత్రువునై యుంటి;
నాయింద్రియముల నణపు మనసును
స్వాధీన మొనరించుకొన లేక
నాయాత్మకే పగదాయనైతి;
మత్సరంబునుమాని, మనసును బ్రతిమాలి,
సకలేంద్రియంబుల సాదు చేసి,
ఆత్మతో మనసున కైక్యంబుఁ గూరిచి,
బుద్ధిబలంబును వృద్ధి పఱిచి,
వివిధవృత్తుల నేకీభవింపఁ జేసి,
సమతలో నిత్యశాంతిని సంగ్రహించి,
జ్ఞానముద్రలో నినుఁ గందు సంయమి నయి,
పరమమైన బ్రహ్మానందపదమునఁ బ్రభు!

౯౨

జల మందలి రసమ్ము,
సవితృజైవాతృకు లందలి తేజంబు నైన వాని;
ప్రామిన్కు లందలి ప్రణవంబు,
నాకాశ మందలి శబ్దమ్ము నైన వాని;
భూమి యందలి గంధమును,
హవ్యవాహను నందలి తేజంబు నైన వాని;
అఖిలభూతంబుల యందలి ప్రాణంబు
మౌను లందలి తపం బైన వాని,
సకలభూతములకు జననకారణ మగు
నాదిబీజరూప మైన వాని,
మూఁడు గుణములకును మూలం బయిన వాని,
నిన్నుఁ గొలుతుఁ గరుణ నింపుము ప్రభు!

౬౩

సర్వజ్ఞుఁ డగు వాని, శాశ్వతుఁ డగు వాని,
నఖిలనియామకుఁ డైన వాని,
నణువునకంటె సూక్ష్మాకృతి యగు వాని,
నన్నింటిఁ బోషించు నట్టి వాని,
నంతరింద్రియముల కందఁబోవని వాని,
నాదిత్యవర్ణుఁ డైనట్టి వాని,
ప్రకృతికతీతుఁడై పరిఢవించిన వాని,
నక్షరబ్రహ్మ మైనట్టి వాని,
నిత్యనిర్మలానందుఁడై నెగడు వాని,
నిన్ను నంతకాభ్యాసన్నిహితుఁ జేసి,
భవతరణ మైన యేకాంతభక్తి లోనఁ,
బట్టి సేవించి, ముక్తిని బడయుదుఁ బ్రభు!

౯౮

అంతటఁ జరియించు నా మహావాయువు
నిండి యాకాశమం దుండు నట్లు,
సకలభూతంబులు సర్వమయుఁడ వగు
నీ యందె నిత్యంబు నిండి యుండు;
ఆత్మమాయ నెవాని నడఁగింతుఁ బొడిగింతు,
వాని నీ వంటని వాఁడ వగుట;
సృష్టిక్రియల కుదాసీనుఁడ వగు నిన్నుఁ
గట్టంగ నేర వే కర్మములును;
నీవధిష్ఠాతవై యున్న నీప్రకృతియె
సృజనఁ గావించు చుండు నీసృష్టి కెల్ల,
సాక్షివై యుండి, నీవె శాసకుఁడ వగుదు,
నీమహత్త్వంబుఁ దెలియంగ నేర్తునె ప్రభు!

గాళి

భూతభావనుఁడును, భూతేశ్వరుండును,
భూతపాలకుఁడు, విభూతియుతుఁడు, నగు
నిన్ను నీవె యెఱుఁగుదువు గాని,
యెవ్వరు నిన్నెఱింగిన వారు లేరు;
అఖిలలోకములు నీయైశ్వర్య మయములు,
సర్వవిభూతి కీశ్వరుఁడ వీవు;
ఏచింతనమున నిన్నెఱుఁగుదు,
నేవస్తుదృష్టిలో నిన్నుఁ జింతించు కొందు;
సకలవిశ్వసౌభాగ్యము, సర్వమయము నైన
యాత్మవిభూతిరహస్య మెఱుఁగఁ జేసి,
సుజ్ఞానసంపన్నుఁ జేసి నన్నుఁ,
నిత్యసత్యవిభూతిలో నిలుపుము ప్రభు!

౯౩

అగణితనేత్రుండవై యెప్పటియు కాక,
పరికించు చుంటివి బహు ముఖముల;
అగణితతేజుండవై యెప్పటియు కాక,
ప్రసరించు చుంటివి బహు కరముల;
అగణితరూపుండవై యెప్పటియు కాక,
పచరించు చుంటివి బహు పదముల;
అగణితభూతాత్మవై యెప్పటియు కాక,
పాలించు చుంటివి బహు ప్రకృతుల;
అఖిలమయుఁడును నఖిలాత్ముఁడైన నీవు,
గాని దేదియు లేదు లోకముల యందు;
కంటి నీవిశ్వరూపంబుఁ,
గంటి నీమహాత్మ్య మెల్లఁ గృతార్థుఁడ నైతిని ప్రభూ!

౯౭

అభిమానముఁ ద్యజించి, యాసల నడఁగించి,
సకలేంద్రియంబుల సద్దణంచి,
అఖిలకర్మముల నీకర్పించి, సమబుద్ధి
నంతరాసక్తి నేకాంతభక్తి నిన్ను ధ్యానించుచు,
నిన్ను పాసించుచుఁ, జిత్తంబు నీయందె హత్తఁ జేసి,
జననమరణరూపసంస్కారసాగర తరణమున
కుదాత్తకరణ మైన నీపవిత్రనామ
నిర్మల స్మరణంబుఁ జేసి కొనుచుఁ,
దొల్లి చేసికొన్న పాపరాశి డుల్చి,
భవబంధము లెడల్చు వారె
నిన్నుఁ జేరు వారలు ప్రభూ!

౧౮

అది నిరతిశయ మైనది;
అది సత్తు గానిది;
అసత్తును గాని, దది సమస్త
మావరించుకొని యున్నది;
అది సకలేంద్రియముల వెలిఁగించునది;
అది గుణరహిత మైనది;
సంగరహిత మైనది;
అది యఖిలంబు భరియించునది;
అది బహిరంతరముల నిండినది;
అది సూక్ష్మమై యిది యని తెలిసి
యూహింప రాని
దది విమూఢుల కెల్ల దవ్వగు నది;
విబుధాళికి సమీపమై యుండు నది;
జగమ్ము లేలు నది;
అది యద్వయమే యగునది;
అది పరమ మైన నీతత్త్వమైనది ప్రభు!

౯౯

ఇది పదాడంబరమే లేని సుగమన, ఇది సుబుద్ధి
గ్రహించి యేలికొనుము;
ఇది యలంకారవిస్తృతిఁ గోరని
శుభాంగి; ఇది స్వభావ
గ్రహించి యేలికొనుము;
ఇది చిత్రవృత్తంబు లెఱుఁగని సౌశీల్య; ఇది సుజాతి
గ్రహించి యేలికొనుము;
ఇది భావశైథిల్య మెఱుఁగని నిర్మల, ఇది సుభద్ర
గ్రహించి యేలికొనుము;
ఇది పవిత్ర, యయోనిజ,
ఇది యనంత భక్తిభావ సంకీర్తనాభ్యాస
యోగయాగసంజాత,
ఇది మదీయాత్మజాత,
ఏలుమి నర్ధాంగిగ గ్రహించి యేలుము ప్రభూ!

౧౦౦

నీకులకాంతను నే నౌదు నన్ను,
గోత్రంబు నెఱుంగ, సూత్రంబు నెఱుఁగ;
నీభోగకాంతను నేనౌదు నన్ను,
మన్మథశాస్త్ర మెఱుఁగ, నమ్నాయ నెఱుఁగ;
నీకీర్తికాంతను నేనౌదు నన్ను,
విశ్వవ్యాప్తి నెఱుఁగ నైజంబు నెఱుఁగ;
నీముక్తికాంతను నేనౌదు నన్నుఁ,
దత్త్వంబు నెఱుఁగఁ దాదాత్మ్య మెఱుఁగ;
ఏమి యగుదునో నీకు నేనెఱుఁగఁ గాని,
భావసంకీర్తనములోన, భక్తిలోన నల్లితి—
సువర్ణశతమాన—మది గ్రహించి తేని,
"జీవేశ్వరుఁడ" వని యెఱుఁగుదుఁ బ్రభు!

౧౦౧

ఇచట సందేహార్తియే సంతతం బుండు,
అచట విదేహారాజ్యసుఖ ముండు;
ఇచట భవక్లేశమే కాపురం బుండు,
అచట నజానంద మమరి యుండు;
ఇచట వ్యయారిష్టమే క్రమ్ముకొను చుండు,
అచట నవ్యయపరమార్థ ముండు;
ఇచటఁ బ్రకృతిమాయయే యేలికొను చుండు,
అచట నిత్యబ్రహ్మ మలరుచుండు;
ఇచట మఱపుండు, నెఱుకయే యచట నుండు,
ఇచట గుణముండు, నిర్గుణ మచట నుండు,
ఇచట లయ ముండు, మోక్షమే యచట నుండు,
ఇచట నచ్చట, నన్ను, ని న్నెఱిఁగితిఁ బ్రభు!

౧౦౨

కడముట్టఁగా నహంకారంబు దిగఁద్రావి,
యభిమానశూన్యులై నట్టి వారు;
మూలమట్టంబుగా మోహంబుఁ దెగఁగోసి,
యాత్మానుభూతిఁ గన్నట్టి వారు;
తుదిఁదాఁకఁగా సంగదోషంబు విడనాడి,
యఖిలంబుఁ దాముగా నరయు వారు,
సాంతంబుగా నరిషడ్వర్గము జయించి,
యతిశాంతచిత్తులై నట్టి వారు,
చక్కఁగా ద్వంద్వముల కెడ చన్న వారు,
తెల్లముగ మాయ కన్నాలఁ దేఱు వారు,
మూలమందని సంసారమును ద్యజించి,
నన్నుఁ బురుషోత్తము గ్రహింప నేర్తురు ప్రభు!

## సే నాం జ లి

ప్రకృతి యెల్లఁ గరంచు ప్రణవంబు తొలుదొల్త
నేగంట ప్రోఁగెనో యెవ్వఁ డెఱుఁగు,
దెసలెల్ల వెలయించు తేజ మాద్యాదియం
దెకంట మెఱసెనో యెవ్వఁ డెఱుఁగు
సకలంబు దనియించు జలదంబు మునుమున్న
యేమింటఁ దోఁచెనో యెవ్వఁ డెఱుఁగు
అఖిలంబుఁ బొదలించు నణువు ప్రప్రథమ స్థం
దేయింటఁ బడియెనో యెవ్వఁ డెఱుఁగు
తర్కరాద్ధాంత గతుల కందని ఫలంబుఁ
బట్టి తఱచుట కంటె నీప్రణయలీలఁ
దేలి సకలంబు మఱచుటే మేలు గాదె?
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

*　　　*

వినవచ్చు నీపల్కు లని యూరితిని దేవ!
శ్రుతుల నింప విదేమి చోద్య మయ్య!
కనవచ్చు నీరూప మని పొంగితిని దేవ!
కనులఁ దెర్చ విదేమి కర్మ మయ్య!
చనవచ్చు నీత్రోవ నని నమ్మితిని దేవ!
పదము నిల్ప విదేమి వంత మయ్య!

మనవచ్చు నీచెంత నని యుబ్బితిని దేవ!
తలఁపు గొల్వ విదేమి ధర్మ మయ్య!
అల్పుఁ డగు నేను, పరమాణు వైన నేను
ఘనతరుని నిన్ను, ద్రిభువనగర్భు నిన్నుఁ
దగుదు నని కొల్వఁ దలఁచుటే తప్పఁ టయ్య!
సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

* *

ఏవిందుఁ గావింప నిష్టమో నీ కంచు
మృదుపదార్థము లెల్లఁ బదను పఱిచి
ఏరసం బొలయింప నిష్టమో నీ కంచు
విరిదేనియల నెల్ల వెదకి తెచ్చి
ఏశయ్యఁ గూర్పింప నిష్టమో నీ కంచు
నలరుజాతుల నెల్ల నలవరించి
ఏపాటఁ బాడింప నిష్టమో నీ కంచుఁ
గలుస్వరము లెల్లఁ గలయఁ గూర్చి
జయవిజయ మైన నీమొగసాల నిలిచి
చాలగా వేచి యున్నాను సమయమునకు
జనని వలె వచ్చి యీ దాసజనుని సేవ
లందికొను మయ్య! సచ్చిదానందమూర్తి!

తలఁపునం దొకింత తెలివి కున్నంతనే
కనులలోఁ జీకటుల్ గ్రమ్ము నేమొ

చిత్తమం దొక్కింత చిటుకు మన్నంతనే
చెవులలోఁ గుంచికల్ చేరు టేమొ
ఉల్లము దొక్కింత జల్లు మన్నంతనే
యొడలిలో మైకంబు లడరు టేమొ
నెమ్మది నొక్కింత గమ్ము మన్నంతనే
యూర్పులో నట్రాఁక లొదవు టేమొ
నేను దరిఁ జేరఁ జాలకున్నానొ యేమొ-
నీవె దూరమై పోవుచున్నావొ యేమొ-
పాలుపోకుండెఁ దెలుపు మీపాటి కైన
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

సంభావనానందస[illegible]ం దెప్పుడైన
దీనుని మొఱ [illegible]నొ
సంకీర్తనోన్మాదసమయ మం దెప్పుడైన
బిడ్డని గతిఁ దలఁపించి నానొ
సంపూజనోల్లాససమయ మం దెప్పుడైన
చిఱుతని వెత జ్ఞప్తి చేసి నానొ?
సంసేవనోత్సాహసమయ మం దెప్పుడైన
దాసుని కష్టంబు దడవి నానొ?
ఏమి చేసినానొ యెఱుఁగని తనముచే
దప్పు లున్న దిద్దఁ దగును గాని

కొసరి కొండ జేసి కోఁపగింతు రఁటయ్య!
పావనస్వభావ! దేవదేవ!

* *

హర్ష ప్రఫుల్లచిత్తాబ్జపీఠము నిల్పి
దీననాథుని సుఖాసీనుఁ జేసి
సమ్మదోద్గళితాశ్రుసలిలధారలఁ దేర్చి
జీవితేశ్వరు నభిషిక్తుఁ జేసి
ఆనందమయవాక్ప్రసూనమాలిక లిచ్చి
శ్రితజనావను నలంకృతునిఁ జేసి
ప్రణయలీలోచ్ఛ్వాసపవనడోలిక నూఁచి
దివ్యధాముని వినోదితునిఁ జేసి
చేరి చేతులార సేవించు టెప్పుడో
కలసి కఱవుదీరఁ గాంచు టెప్పుడో
అలరి యాదరోక్తు లాలించు టెప్పుడో
తెలియు టెపుడో—ఆస తీరు టెపుడొ?

* *

పాటించి నీవింత పలికితేఁ జాలదే
పలుకని బంగారు భాగ్య మేల?
నమ్మించి నీవింత నవ్వితేఁ జాలదే
నవ్వని రతనాల నాణె మేల?
మురియించి నీవింత ముట్టితేఁ జాలదే
ముట్టని ముత్యాల మూట లేల?

శోధించి నీవింత చూచితేఁ జాలదే
చూడని నీలాల మేడ లేల?
పలుకుదీవ లేని భర్మవల్లిక యేల?
రసమయంబు గాని రాగ మేల?
స్వామిఁ దనుపలేని సంకీర్తనము లేల?
జీవనంబు లేల?—దేవదేవ!

* *

మలపుకో లేనైతి మలసి నీకై నేఁత
నడలింపఁ జేయు నావడఁకుఁ దనము,
అఁచుకో లేనైతి నడరి నీనునుమేన
నొగిలింపఁ జేయు నాగసురు పాటు
అడఁచుకో లేనైతి నలమి నీనెమ్మోముఁ
గందింపఁ జేయు నాశోక యూర్పు
నిలుపుకో లేనైతి నిండి నీవేర్పుకైఁ
గరఁగింపఁ జేయు నాకంటి నీరు
తప్పు గలిగె నంచు దద్ద రిల్లుచు గాని
యేమి సేయవలెనొ యెఱుఁగ కుంటి
సర్వకారణుఁడవు క్షమియింప కుందువే
పావనస్వభావ! దేవదేవ!

అభవ! నీ కర్ఘ్యపాద్యములు గాఁజాలునే
నిస్సార మైన యీ నీటిబుగ్గ

కాంత! నీయారాత్రికంబు గాఁజాలునే
అతిమునిఁ దైన యీ మెఱుఁగుఁ బురుగు
విశ్వతోముఖ! నీకు విందు గాఁజాలునే
పేలవం బైన యీ వేలగింజ
నాథ! నీ సంసేవనంబు గాఁజాలునే
చిందుపం బైన యీ చిన్ని పూవు
పరమదుర్లభ మైన నీకరుణ లేక
తావకశ్రీపదాంభోజ సేవనమున
నలరు టబ్బునె యీ పరమాణువునకు
సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

*         *

మొగమోటములు గూర్చి మగిడి పోవకు సుమీ
పలుకెల్ల నమృతంబు చిలుకు చుండె
కనుఁబ్రామికలు గూర్చి కదలి పోవకు సుమీ
పలువెల్లఁ బులకలు పండు చుండె
పారవశ్యముఁ గూర్చి పాఱి పోవకు సుమీ
తలఁపెల్ల నానంద మొలుకు చుండె
ఆత్మవిస్మృతిఁ గూర్చి యట్టె పోవకు సుమీ
భవమెల్లఁ గోర్కులు పండు చుండె
మఱపుఁ గొల్పకు మింక నేమఱకు మింకఁ
దలఁపుఁ ద్రిప్పకు మింకఁ బోఁదలప కింక
ఆదుకొను మింక మన మేక మైతి మింక
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

ప్రత్యయప్రకృతిలోపం బైన శబ్దవి
న్యాసమే నీయుపన్యాస మెల్ల,
ఆదిమధ్యాంతశూన్యం బైన ఘటనాను
బంధమే నీసుప్రబంధ మెల్ల
తానమానబహిర్గతం బైన స్వరసన్ని
ధానమే నీభవ్య గాన మెల్ల
సగుణనిర్గుణవిశిష్టం బైన సత్క్రియా
చరణమే నీకళావరణ మెల్ల
అగు నని పురస్కరించుటే యనుచితంబొ
కాదని తిరస్కరించుటే కాపథంబొ
తెలియకున్నది నను బ్రబోధింపు మయ్య!
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

* *

నాథ! నీవాక్ప్రసూనములలో నెందుండి
తేనియ లూరునో కాన రాదు
కాంత! నీదృక్తారకములలో నెందుండి
మెఱపులు మెఱయునో యెఱుఁగ రాదు,
రమణ! నీభావానిలములలో నెందుండి
వలపులు నిండునో తెలియ రాదు
దేవ! నీహాస్యచంద్రికలలో నెందుండి
యమృతంబు గురియునో యరయ రాదు

చెవియుఁ గన్ను, ముక్కు జిహ్వయు మా కిచ్చి
దేహ మిచ్చి కొంత తెలివి యిచ్చి
కొంత దాఁచుకొనుట కోరికయా నీకు?
పావనస్వభావ!

మొవ్వపువ్వునకును ముందిరేకు కప్పేల
పిందెకు బిరుసాకు పీట యేల
మించుఁదీఁగకు నీలమేఘంపుఁ దెరయేల
చుక్కకుఁ జీఁకటి ప్రక్క యేల
మురిపెంపుఁ బనసకు ముండ్ల కుప్పస మేల
చినుకుపూసకు నాలిచిప్ప యేల
చిగురాకుఁ గొమ్మకుఁ జీర్ణ పల్కల మేల
పరమాణువున కస్థి భవన మేల
చెక్కు చెదరకుండఁ జెన్ను మాయక యుండ
మృదుపదార్థములకు మేలు గూర్చి
నిలువరించుకొనుట నీస్వభావ మఁటయ్య!
పావనప్రభావ! దేవదేవ!

చిగురుటాకులఁ జూచి చిన్నివన్నెలఁ జూచి
పూవుగుత్తులఁ జూచి తావిఁ జూచి
దోరపండులఁ జూచి తీరుతీయముఁ జూ
చిలుకబోదలఁ జూచి చెలువుఁ జూచి .

చుక్కవేరులఁ జూచి సొంపు పెంపులఁ జూచి
చందమామను జూచి సౌరుఁ జూచి
చలువకాల్వలఁ జూచి కలకలంబులఁ జూచి
కొండకోనలఁ జూచి కొమరుఁ జూచి
యొడలు పులకింప నానందపడుట మేలొ?
యెడద గంపింపఁ జిడిముడి పడుట మేలొ?
తెలిసి తెలియని నను బ్రబోధింపుమయ్య!
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

* *

కన్నుండి గ్రుడ్డినై కల్యాణమయ మైన
నీమూర్తి దర్శింప నేరనైతి
చెవియుండి చెవిటనై జీవమోహన మైన
నీగాన మాలింప నేరనైతి
తనువుండి జడుఁడనై యనువర్తనం బైన
నీసన్నిధినిఁ జేర నేరనైతి,
మతియుండి విమతినై యతిమనోహర మైన
నీతత్త్వ మూహింప నేరనైతి,
పాణిపంకజమునఁ బరమార్థ ముండియుఁ
గోరి యనుభవింప నేరనైతి,
ఇంటి దీప మిట్టు లిరులు గ్రమ్ముట యేమొ!
తెల్పి తేర్పుమయ్య! దేవదేవ!

తెలిసి కన్నులు మూసి పులకరించు నొకండు
తెలియక దలతిక్కఁ దిరుగు నొకఁడు,
తెలిసియుఁ దెలియక కలువరించు నొకండు
తెలివిలో సుఖమునఁ దేలు నొకఁడు
తెలిసియుఁ దెలియ నట్టులమటించు నొకండు
తెలియక తెలిసి నట్లలరు నొకఁడు
తెలిసిన దనువారిఁ దిట్టిపోయు నొకండు
తెలియ లేదనువారిఁ దేర్చు నొకఁడు
అధిప! నీసృష్టి బహుభంగు లైన యట్లి
యనుభవంబులు భిన్నంబు లగుచు నుండె
ఏది త్యజియించి యేది గ్రహింతు నయ్య!
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

*　　　*

చిన్ని మెఱుంగు దీవియలఁ
జెల్వము, శైలములన్ మహత్త్వమున్
వెన్నెలలం బ్రశాంతమును,
వేణికలన్ మధురామృతత్వమున్
మన్నల సుస్థిరత్వము, వి
మానపథంబులఁ బ్రాభవత్వమున్
గన్నులఁ బెట్టియుం దెరలఁ
గట్టెద వేమిటి కీశ్వరేశ్వరా!

అఖిలజీవనపాత్ర మైన నీసత్కృపా
వారి నాకన్నీరు చేర నిమ్ము
అంతర్బహిర్వ్యాప్త మైన నీప్రణయవా
యువున నానిట్టూర్పు నొలయ నిమ్ము
అమృతమోహాన రూపమైన నీసంగీత
కళ నావచోలీలఁ గలియ నిమ్ము
ఆనందపరిపూర్ణ మైన నీసౌభాగ్య
నగరి నాతనువల్లి సాగయ నిమ్ము
నిన్ను దర్శించి నీదు సన్నిధినిఁ జేరి
నిన్ననుకరించి, నీమూర్తి నే స్మరించి
యాడి పాడఁగనిమ్ము నా కన్య మేల?
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

కాయపై శితకంటకములఁ గన్నంతనే
పనస నుమ్మెత్తల బంతి కీడ్చి,
పైఁదోలు గింజలోపలఁ జూచి నంతనే
మామిడి వేఁపకొమ్మలకుఁ గట్టి
మెడమీఁది జూలు వ్రేల్మిడిఁ గాంచినంతనే
సింగంబుఁ గుక్కల చెంతఁ జేర్చి,
దాడలోఁ గొమ్ముల జాడఁ గన్నంతనే
పుడకకుఱ్ఱిఁ బదరుల మందఁ బెట్టి

మంచిచెడ్డ లేక మతి లేక గతి లేక
చూచి నట్లు నాకుఁ దోఁచి నట్లు
కవితఁ గట్టి దుష్టకర్మం బొనర్చిన
వికృతి నన్నుఁ బ్రోవవే పరేశ!

* *

శూన్యార్థపదవిశిష్టుఁడ నైన నేనేడ
పరమార్థతత్త్వవిస్ఫురణ మేడ?
గురుతమోగుణకళంకుఁడ నైన నేనేడ
కల్యాణగుణధామకలన మేడ?
మలినదుర్భావదుర్మదుఁ డైన నేనేడ
శుద్ధస్వభావవిస్ఫూర్తి యేడ?
సతతవైరస్యభాజనుఁ డైన నేనేడ
ఆనందమయరసావాప్తి యేడ?
కవితగట్టి పాడఁగల నంతియే కాని
పలుకుఁ దలఁపుఁ గూడఁ బడయ రాని
నిన్నుఁ దనియఁజేయ నేనేడ-నీవేడ?
పావనస్వభావ! దేవదేవ!

* *

గుణరూపపరిహీనగోమాయువును నేను
త్రిభువనావనకామధేను వీవు
నిష్ప్రచ్ఛరంపుఁ జౌడుప్పు పఱ్ఱను నేను
కమనీయకేదారఖండ మీవు

కలుషప్రదూషితాంగారమూర్తిని నేను
ఆర్తచింతామణీమూర్తి వీవు
ఈడుపు గాళ్ళకొల్లేటి కొంగను నేను
పరమహంసస్వరూపంబ వీవు
నాకు నీకును నెంత యంతరము గలదొ
తెలిసికొంటి నీనాఁటికిఁ దెలిసికొంటి
నీవు నన్నింక నేనాఁటి కేలికొనెదొ?
సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

* *

కఱకురాగుట్టల యిఱుకు సందుల నుండి
తేటనీ రొలయించు తీరు గాక
పరుసంపు గుంపుల చెఱకు గఱ్ఱల నుండి
పానకం బొలికించు పగిది గాక
అగ్గికొండలతండ మైనిండు నెలనుండి
చలువవెన్నెల నించు జాడ గాక
కటికచీఁకటి కారుక్రమ్ము మబ్బులనుండి
మెఱుఁగుఁ దీఁగెలఁ బెంచు సరణి గాక
కలుషమతికి నాకుఁ గవితాసవముఁ గూర్చి
వికృతిదీర్ప లేక విసుగు కంటె
భక్తిరసము గూర్చి పాడించుకో రాదె!
పావనస్వభావ! దేవదేవ!

కొనకొమ్మ దెమలించి కోసికోఁ జాలక
తావిగొజ్జఁగిఁ గాలఁ దన్నుకొంటి
చిఱుజీడి నెడలించి సేవింపఁగా లేక
తీయమామిడి మోకఁ ద్రెంచుకొంటి
అలఁతిపుప్పొడిఁ దేర్చి యారగింపఁగ లేక
పువ్వుదేనియఁ బాఱఁబోసికొంటి
పలుకుఁదీఁగ లమర్చి పాడుకోఁ జాలక
కనకవల్లకి మంటఁ గలిపికొంటి
దూరదృష్టి లేక దుర్బల బుద్ధినై
నీప్రసాద మెల్ల నీటఁ గలిపి
యాస దీఱ కిట్టు లల్లాడు నన్నెట్టు
లాదరింతు వయ్యా! యాదిదేవ!

కలనిస్వనముల లోకం బెల్లఁ దనియించు
కోకిల యెదురింటఁ గాకు లేల?
గుణగౌరవంబులఁ గుల మెల్ల వెలయించు
క్రొత్తడి సరియింటఁ గులట లేల?
ఘనపరీమళములఁ గడ లెల్ల నెలయించు
క్రొవ్విరి నడిమింటఁ బ్రువ్వు లేల?
ధవళకాంతుల దిగంతర మెల్ల నలరించు
మదమామ పొరుగింట మబ్బు లేల?

పరమ మైన భక్తిభావంబు పాలింట
విషయ వాంఛ లేల? వికృతం లేల?
మంచి వెనుకఁ జెడ్డ లుంచి తీరెద వేల?
అద్భుతస్వభావ! ఆదిదేవ!

తలఁపులోఁ గలుషంబు తగ్గునో తగ్గదో
నెఱి దప్పి తల యెల్ల నెరసి పోయె
మనసులో మమతలు మాయునో మాయవో
సిరి తప్పి చూపెల్లఁ జెదరి పోయె,
మొదటిలో దోషంబు వదలునో వదలదో
కసి దప్పి పండ్లెల్ల వసిలి పోయె
ఎడఁదలో నాసలు వెడలునో వెడలవో
పసి దప్పి మేనెల్ల సడలి పోయె,
ఇంత పుట్టి నింక నేమగునో యంచుఁ
గుమిలి కుమిలి యేడ్చి క్రుంగి క్రుంగి
నిన్ను శరణు గంటి నీదె భారం బంటి
తీర్పు మెట్టు లైన దేవదేవ!

ఆచేత నీచేత నందించుటే కాని
నీ చేయి నాచేత నిలుప లేమి?
ఆనోట నీనోట వినిపించుటే కాని
నీనోట నాకు విన్పింప వేమి?

ఆమూర్తి నీమూర్తి నటియించు నే కాని
నీమూర్తి నాకుఁ గాన్పింప వేమి?
ఆయింట నీయింట నాడించు నే కాని
నీయింట ననుఁ జేరనీయ వేమి?
పట్టు విడువఁ డంచుఁ దిట్టిపోయు నటంచుఁ
గొట్టు నంచుఁ దగవుఁ బెట్టు నంచు
దిగులు పుట్టెనే మొ దిద్దుకో వేమయ్య!
పావనస్వభావ! దేవదేవ!

తెమ్మెరల్ వలపుల గ్రుమ్మరించుచు నుండఁ
గ్రొన్నన యేమూల నున్న నేమి?
వెన్నెలల్ చలువల వెలువరించుచు నుండ
జాబిల్లి యేత్రోవఁ జన్న నేమి?
పలుకులు జుంటి తేనెలఁ జాలువారు చుండ
మరు తేజి యేకొమ్మ మన్న నేమి?
కవితలు సరసంపుఁ గళల నీనుచు నుండ
గవిరత్న మేచాయఁ గన్న నేమి?
నీకటాక్షంబు లే జీవలోకమునకుఁ
జింతి తార్థంబు లొసఁగి రక్షించు చుండ
నీ వెచట నున్న నెటులున్న నేమి లోటు
సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

ఈపాట లాపాటలే పాడితిని గాని
నీచేతి మురళిఁ గానేర నైతి
ఈబాస లాబాసలే పల్కితిని గాని
నీగూఁటి చిలుకఁ గానేర నైతి
ఈవాడ లావాడలే చేరితిని గాని
నీయింటి బంటుఁ గానేర నైతి
ఈజన్మ మాజన్మమే యెత్తితిని గాని
నీయెత్తు బిడ్డఁ గానేర నైతి
చీఁకటింటి లోన చెఱ్ఱారలను నైచి
నిన్నుఁ జేరఁ దగిన తెన్నుఁ గనక
తల్లడిల్లు చుంటి దయచేసి యిఁక నైన
నాదరింపరాదె యాదిదేవ!

చీఁకటిమసిఁ బూయు చేదోల్ప కుండనే
వెన్నెల నద్దు కేల్వెన్నె నుంచి
అనలకీలల గుప్పు కను మూయ కుండనే
యమృతంబు గురియించు నక్షి తెఱచి
భువనవృత్త మెఱుంగు చెవిఁ ద్రిప్ప కుండనే
విజ్ఞప్తు లాలించు వీ నొసంగి
ఖలుల శిక్షించు నాజ్ఞల నాఁప కుండనే
ఘనుల రక్షించు శాసనముఁ జేసి

అనునిమేషము లోకపాలనము సేయు
ప్రభుఁడ వగు నీకు నావిచారముఁ దలంప
నామొఱాలింపఁ బాలింప ననుగ్రహింపఁ
దెలిసి యెప్పుడు గల దయ్యా! దేవదేవ!

లలితంపుఁ గళల సొంపులు నింపు వెన్నెలఁ
జిలికించు నిండు జాబిలినిఁ జూపి,
చెలువంపు టలరుల పొలపంపు వన్నెలఁ
బులకించు వలపు తీవలను జూపి
సరసంపుఁ బలుకులఁ బరువంపు విరిదేనె
లొలికించు శుకపికంబులను జూపి
మురిపెంపు రూపుల నెఱినించు ముద్దులఁ
దులకించు చిత్రవస్తువులఁ జూపి
పాలకై తన్నుఁ బీడించి ప్రాఁకులాడు
పిల్లకాయను మఱపించు తల్లిలాగు
ప్రేమ నినుఁ గోరు నను మఱపింతు వేల?
సచ్చిదానంద లీలాప్రసన్నమూర్తి.

* *

ప్రొక్కి వేఁడుకొలంది మూతి ద్రిప్పుదు గాని
బల్మిఁ గైకొన నడ్డు పడఁగ లేవు
వెఱచి వీఁగుకొలంది విక్రమింతువు గాని
తేఱిచూచిన నిరోధింప లేవు

విస్మయించు కొలంది మిన్న కందువు గాని
పట్టు పట్టిన మాట నెట్ట లేవు
కొలుచుచున్న కొలంది కొండ యెక్కుదు గాని
ఘాటి సూపిన గీటు దాటలేవు
బింక మొకవంక నొకవంక బెరుకుఁ దనముఁ
బఱపి యిటువంటి మాయలు నెఱపకున్న
నాట కళగట్టదే జగన్నాటకునకు?
సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

ఏఱులాగున నిట్టె పాఱిపోయెద వేమి
సుదల నైనను వెన్కఁ జూడ వేమి?
మెఱపులాగున నిట్టె మెఱసి పోయెద వేమి
నింగి నైనను గాలు నిల్ప వేమి?
గాలిలాగున నిట్టె కలిసి పోయెద వేమి
దవుల నైనను రూపుఁ దాల్ప వేమి?
గాములాగున నిట్టె కదలి పోయెద వేమి
కడల నైనను శాంతిఁ గాంచ వేమి?
అర్ఘ్యపాత్రఁ బూని యారాత్రికం బెత్తి
ధూప మెుంచి పండ్లదోసి లొగ్గి
యెవరు పిలిచిరయ్య! యెచటకేఁగెద వయ్య!
ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

ఉపవాసమే కాని యెప్పుడైనఁ బుడిసెఁడు
జలమైన ద్రాగిన జాడ లేదు
ఆయాసమే కాని రేయైనఁ బట్టెఁడో
గిరమైనఁ గైకొన్న గుఱుతు లేదు
సంచారమే కాని క్షణమైన రవ్వంత
యెచ్చుగైన నిలిచిన యచ్చు లేదు
జాగారమే కాని వేగైనఁ గానంత
కన్నైన మూసిన చిన్నె లేదు
పానకంబు చేసి పరమాన్నమును వండి
మెఱుఁగు పీఁట వెట్టి విరులు పఱచి
యెదురు సూచుచుంటి నిల్లు చేరఁగ దోయి!
ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

ఏచుక్క తళుకులో నీచెల్వ మున్నదో
చెంగల్వ నడుగునా చెప్పు నేమొ,
ఏపువ్వు దేనెలో నీప్రేమ యున్నదో
మొలఁదేటి నడుగనా తెలుపు నేమొ,
ఏపక్షి పలుకులో నీపాట యున్నదో
వినుచూలి నడుగనా వినుచు నేమొ,
ఏమింటి తరఁగలో నీమూర్తి యున్నదో
నుడతేని నడుగనా చూపు నేమొ,

వట్టి భ్రమలు గాక వారైన వీరైనఁ
దెలిసి నంత తెలుపఁ గలరె కాని
నీవు వచ్చి యెదుట నిలిచి నన్నుంచునా?
ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

అడుగుదమ్ములు మాయు నందు వేమోయి నా
కన్నీటివఱద లాకడన్ను లేవె?
అంధకారము గ్రమ్మ నందు వేమోయి నా
విరహాగ్ని దీప్తు లాదరిని లేవె?
అతనుతాపము గ్లు నందు వేమోయి నా
వలపుఁ గ్రొందీవ లాకెలన లేవె?
అశుభవాసన లంటు నందు వేమోయి నా
నిట్టూర్పు గాడ్పు లాత్తట్టు లేవె?
హృదయపద్మాసనంబు నీయెదుటఁ బెట్టి
యుల్ల మలరంగ సేవింప నుంటినోయి!
వేగ విచ్చేసి కొల్వు గావింపు మోయి!
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

ఐశ్వర్యమును గోర ననుకొంటివో యేమొ-
అసల నడఁగింపు మంతె చాలు,
అర్ధాసనము వేఁడ ననుకొంటివో యేమొ-
అడుగుల కడ నిల్పు మంతె చాలు,

అపవర్గ మాసించు నను కొంటివో యేమొ-
అజ్ఞాన మెడలింపు మంతె చాలు,
అమృతత్వ మర్థించు ననుకొంటివో యేమొ-
అభవత్వ మిప్పింపు మంతె చాలు,
తిరుగులేని దాత దొరకెఁగదా యంచుఁ
దలకుఁ దగని దడుగఁ గల నఁటయ్య!
ఎదుటఁ బడుము చాలు నీకోరికల్ల కేమి
ప్రణయగుణసనాథ! ప్రాణనాథ!

సిరము పాదములతోఁ జేరిపోయిన దాఁక
మోదంబుతో నిన్ను మ్రొక్కనిమ్ము!
ఎలుఁగు గద్గదికతో నింకిపోయిన దాఁకఁ
దెలివితో నిన్నుఁ గీర్తింపనిమ్ము!
కన్నులశ్రువులతోఁ గరఁగిపోయిన దాఁకఁ
గోర్కితో నిన్నుఁ గన్గొనఁగ నిమ్ము!
ఒడలు గగ్గురులతో నొల్లబోయిన దాఁక
నిష్ఠతో నిన్ను ధ్యానింపనిమ్ము!
ఆయు వెన్నాళ్ళుండునో యంత దాఁక
మఱల జన్మంబుఁ గలుగుచో మఱియు దాఁక
జిత్త మలరంగ నీసేవ సేయనిమ్ము!
సత్కృపాధామ! దేవతాసార్వభౌమ!

విరిదమ్మి వెలుఁగుతో వీక్షించు ముద మబ్బె
చూపులఁ బొడసూపు సుకృత మెపుడొ?
కలకంఠరవములోఁ బలికించు హిత మబ్బె
పిలుపులోఁ బలుకాడు పేర్మి యెపుడొ?
వలిగాలి తరఁగతో సోలయించు సుఖ మబ్బె
సోలపులోఁ దమినించు సుదిన మెపుడొ?
తరుణేందుకాంతిలోఁ దలపించు ప్రియ మబ్బె
తలఁపులోఁ దులకించు కలిమి యెపుడొ?
ఎలమిఁ గాన్పించి, నెమ్మితోఁ బలుకరించి
కేలఁ గీలించి, హృదయంబు మేలగించి
కలసి కలయించి వెలయించి గారవించి
ఇదియె చాలనిపించు టింకెపుడొ దేవ!

ననుఁ బ్రోవు మనుట యేనాఁటి వేడుక మాట
విశ్వరక్షకుఁ డగు విభుని చెంత,
దాసుఁడ ననుట పెద్దలనాఁటి మర్యాద
భక్తపాలకుఁ డగు ప్రభుని చెంత,
సిరుల నిమ్మనుట యాశ్రితజనాభ్యాసంబు
సర్వప్రదుం డగు స్వామి చెంత,
నావాఁడ వనుట సనాతనాచారంబు
సకలాత్ముఁ డైన యీశ్వరుని చెంతఁ,

గాన నోదేవ! నీసేవఁ గాంచు కంటెఁ
గోరి నీకాత్మ నర్పించు కొనుట కంటెఁ
గామితార్థంబు లింక మాకేమి గలవు?
సత్కృపాధాము! దేవతాసార్వభౌమ!

# శ్రీ సూ క్తి సు ధా ని ధి

## (శ్రుతివీథి)

**ప్రణయతరంగము :**

చపలవిలోల లోచనలఁ
జంపఁ దలంచిన మృత్యుమూర్తులో
విపులకృపాంబురాశి యగు
వెన్నుని తిన్నని సోగ కన్నులో
యపుడె వికాస మందిన న
వాంబురుహంబులు వోలెఁ దోఁచి న
న్నెపు డడలించు చున్నవి క
దే సఖులార! యిఁకేమి సేయుదున్.

నెచ్చెలులార! నన్నిటుల
నింద యొనర్చుచు బాధ పెట్టఁగా
వచ్చిన దేమి మీకు! సుర
వల్లియొ కాక తదంకురాగ్ర
ముచ్చిలి వెన్నఁ దిన్న యల
ముద్దుల కృష్ణుని దివ్యనాసయో
యుచ్చను దోఁచి దీపశిఖ
యేపున నన్నుడికించు చుండఁగాన్.

3

పగడమో, వింతఫలమొ, నాపాపఫలమొ
తెలియకున్నది; మోహనజలదమూర్తి
యధరబింబ మెల్లెడలఁ బ్రత్యక్ష మగుచుఁ
బ్రాణముల నేచుచున్నదో పడఁతులార!

౪

అనదల నదల్చు నీలశరాసములో
అలరువిల్తుని యిక్షుశరాసనములో
స్మరగురుని భ్రూలత విలాసము లవేమొ
కాని నన్నేచుచున్నవో కాంతలార!

౫

కొనగోటన్ గిరిఁ దాల్చి పొల్చు మురళీ
గోపాలు చిర్నవ్వులో
సునుముత్యాలసరంబులో, విశదకాం
తుల్ దోఁపగాఁ నిల్కడం
గని చూపట్టు మెఱుంగులో యెఱుఁ
గన్ నన్ బాధించి వేధించెడిన్
మనఁగాఁ జాలను తల్లులార! యిఁకఁ నన్
మన్నించి. వీడ్కొల్పరే!

౬

ఎలమిని గోరు కాంతలకు
నీసున దూరు ఖలాళికిన్ భ్రమం

గొలిపి, వెలుంగుచున్ మకర
కుండలలీలలఁ గ్రాలు పల్లవం
బులో? ఫణిరాజతల్పు నవ
మోహనకుండలకాంతులీను వీ
నులో? కనుదోయి నాఁగి మది
నొవ్వఁగ నెవ్వఁగ గూర్చుచుండెనే!

౭

అదె కన్గొమ్మనఁ జాలఁ గాని చెలు
వా! యర్ధేందు దృగ్జాలమో?
హృది నాసించెడి వారి పాలిటి విషో
ద్రిక్తౌషధీమూలమో?
సుదతీమోహనుఁడౌ చతుర్భుజుని క
స్తూరీస్ఫురత్ఫాలమో?
మదిలోఁ దోఁచి విరాళి నేచి యిలయిం
పం జూచు నేమందునే!

౮

చెలువమ్మే తన సొమ్ముగా వెలయు రా
జీవమ్ము, చాపమ్ము క్రొం
దలిరుందీవియవిద్రుమం బలరు ము
త్యంబున్ సుధాబింబమున్
చెలు వందం గల కాంతి మండలము ఆ
[illegible]

డలమై మిన్నులఁ దోఁచి పాపముల కొం
డ ల్గా నన్ను మండించు నే!

ఎనసి జగత్త్రయంబు గ్రసి
యించు గభీరతమిస్రగోళగ
ర్భనిభవినీలతంతునిక
రంబులు గావవి శ్యామసుందరాం
గుని వారినీలనీలమృదు
కుంతుల వల్లులు గాని; పుష్పవా
సనఁ గని తైనఁ బోల్చుకొనఁ
జాలక నన్నలయింతు రేటికే?

ఇలువడి మేరమీఱి నగు
నే! కులకాంతలు వీథికెక్కినన్
నలుగురు నవ్వి పోరె? యని
నన్నరికట్టెదరమ్మలార! యు
జ్జ్వలమణికాంతులన్ భువన
జాలము రంజిలఁ జేయు శౌరి ని
ర్మలమకుటంబుపైఁ దవిలి
ము రాముసనం బిఁక నేమి చేయుదున్

సందేశతరంగము :

౧

పఱవాఁకకు దిరుగాడు సారసమ! నా
పై జాలిమై నెట్టెడాల్
వరిచేలం దులకించి మించు తిరువ
ణ్వండూరిఁ బాలించు న
ప్పిరుమాళ్ళకు వరదున్ సుదర్శనధరున్
బింబాధరుఁ జేరి దు
ర్భరపాపాహతిఁ జిక్కి చిక్కువడు నా
పాట్లన్ని వేదింపవే!

౨

చెలువముఁ బ్రేమముఁ మృదుల
శీలముఁ గల్గిన బోటితోఁ గుతూ
హలమున మేయు నోజలవి
హంగమ! నిచ్చలు వేదయజ్ఞఘో
షలఁ దగు నప్పురం బరిగి
స్వామి జగత్త్రయగర్భుఁ గాంచి యం
జలిఘటియించి శ్రీచరణ
సన్నిధి నామొఱ విన్నవింపవే!

3

బారులు దీరి మొల్లెడలఁ
[illegible] జేరి [illegible]

చారవిహంగులార! వర
సంపదలన్ విలసిల్లుచున్న వం
దారురథాంగపాణిఁ, గరు
ణోదధి, బింబఫలోష్ఠు, భక్తమం
దారునిఁ జేరి మ్రొక్కిడి
నా వలవంతలఁ జెప్పి చూడరే!

౮

హితభోగాత్యనురాగసిద్ధి నెడఁబా
టే లేని రాయంచ దం
పతులారా! శ్రుతిఘోషనించు తిరువ
న్వాండూరఁ గొల్వున్న యా
శ్రితచింతామణి భక్తవత్సలుని సం
సేవించి నీదాసి యొ
క్కతె నీకై నగమయ్యె' నంచు దయగ
ల్గన్ దెల్పి ప్రార్థింపరే!

౯

అలుకలు, సాంత్వనోక్తులు, న
యంబు లెఱింగి ప్రియానమేతులై
యలరెడు నంచలార! తడి
యారని పంకము లందు శంఖముల్
చెలఁగు పురంబుఁ జేరి తుల
సీదళదామకిరీటు నావిభుఁ

గొలిచి నమస్కరించి దయఁ
గూర్చఁగ నాకయి ప్రస్తుతింపరే!

౬

అలరుం బొన్నలఁ బాడు కోకిలములా
రా! మీనముల్ దూలు ప
ల్వలముల్ గల్గి వెలుంగుచున్న తిరుప
ణ్ణాంతూరు వేంచేసి వే
ల్పులకున్ వేల్పయి చక్రహస్తుఁ డగు నా
లోకేశ్వరుం గాంచి నా
తలఁ పూరక, భ్రమదీఱ, నవ్విభుని వా
ర్తల్ దెచ్చి రక్షింపరే!

౭

నెమ్మేను మాత్రమే నీలాంబుదము గాని
పాటలాధర మేమొ పగడ మమ్మ!
కనుబొమల్ మాత్రమే కార్ముకమ్ములు గాని
తరలాక్షు లేమొ కెందమ్మి లమ్మ!
కరములు మాత్రమే కల్పశాఖలు గాని
శయము లేమో కుశేశయము లమ్మ!
కాళులు మాత్రమే కరికరంబులు గాని
పదము లేమో కోకనదము లమ్మ!
దరసుదర్శనవస్తుమాత్రములె కాని
కరము లేమొ వరాభయకరము లమ్మ!

తిరుపురం బేలు నాసామి గుఱుతు నట్టి
చిన్నిచిలుకమ్మ నామాట చెప్పి రమ్మ!

౮

విరియం బూచిన పొన్నలున్ బొగడలున్
వేష్టింపఁగాఁ జల్లనౌ
తిరువణ్ణ్వండురుఁ జేరి చిన్నిచిలుకా!
దివ్యత్కిరీటోన్నతున్
సరసాంభోధతనున్ జతుర్భుజుని స
జ్జాతాక్షు దర్శించి, శ్రీ
చరణాబ్జంబుల చెంత నా తుది నమ
స్కారంబు లర్పింపవే!

౯

సరసీజాసనరాజహంసమ! యుష
శ్శృంఖారవాపూర్ణమౌ
తిరువణ్ణ్వండురుడాసి డాసి నను నా
ర్తిం ద్రోసి దాఁగున్న య
ప్పరమేశున్ హరిఁ గృష్ణదేవుఁ గని శ్రీ
పాదంబునన్ వ్రాలి దు
ష్కరశాపాహతిఁ దూలు నా వెతల నే
కాంతంబునన్ దెల్పుమా!

౧౦

వలపుం బుప్పొడి పూఁత నొప్పు మధుప
వ్రాతంబులారా! విని

ర్మలపంపాతటినితటో త్తరమునన్
రాజిల్లు వండూరి ని
చ్చలుఁ బాలించు దశాస్యదుర్గనిధనుఁ
శౌరిన్ విలోకించి "నిం
దలు నాకేల? త్వదర్థమే బ్రదికి యు
న్నానంచు వాక్రుచ్చె రే!

జోత్స్నా నతరంగము :

నామీఁద వలమూపు నాటింపగాఁ నేల
నాయాట భంగంబు సేయ నేల?
ఇదిచూచి నీప్రియ లీనడింపఁగ నేల
రొయురలు నిన్నాడ నే నోర్వ నేల?
నీకంటెఁ బ్రేయసుల్ నాకెవ్వరన నేల?
మరు లేఁచ నీ నంగిమాట లేల?
ఒట్టుసత్యంబులు గట్టిపెట్టుట యేల
నాచెంతఁ గూష నీ నటన లేల?
గచ్చకాయయు బంతి నాకిచ్చి వైచి
వంచనలు మాని పదవోయి వారి కడకె
ప్రబలలంకాధినాథవై భవవిరామ!
అఖిలమాయాప్రకామ! రామాభిరామ!

౨

చూపుఁదూపుల నన్నుఁ జుట్టుముట్టెద వేల?
మాఱు పోరాడు నీవార లుండ
నవ్వువెన్నెలవాఁక నన్ను ముంచెద వేల?
సరిగంగ లాడు నానవతు లుండ
బర్హిపింఛంబు నాపైని ద్రిప్పెద వేల?
మటుమాయ లాంద్రు నీమగువ లుండ
మురళీధ్వనుల నన్ను మరులుకొల్పెద వేల?
తొత్తులై నానూడుకత్తె లుండ
గోల నగు నన్ను వలపులఁ గూల్ప నేల?
తుట్టతుద కాన లన్నియుఁ దూల్ప నేల?
చిట్టకాల్మాని పొమ్ము నీచెలుల కడకె
అఖిలమాయాప్రకామ! రామాభిరామ!

సరసీజాక్షులు, పల్లవాధరము హాసజ్యో
త్స్నయున్ నెమ్మదిన్
గరఁగింపన్ బలుబాములం బడితి నిన్
గాంక్షించి; బర్హాలకా
భరణాల్ నీప్రియ లేనెఱుంగుదును నన్
బాధింపఁగాఁ బోక నీ
మురళీగానము విన్పి పిల్చుకొను మా
పూఁబోండ్లనే మాధవా!

౪

అల పాలేటిని వెన్నఁ గొన్న నెఱజా
ణా! నేఁటి నీమంపుఁ గ
న్నులకున్, వాఁడిన మోవి చెన్నులకు నే
నో కారణం బౌర! మా
యలు నాచెంగటనా? నినున్ వలచి నీ
కై చిక్కి నాప్రాణకాం
తల నమ్మింపుము! పొమ్ము వారి కడకే!
నామెప్పు నీ కేటికిన్!

౫

లోకము లన్నియుం గడుపు
లోఁ బ్రళయంబున దాఁచి చిన్నిమ
ఱ్ఱాకునఁ బవ్వళించు కప
టాత్ముఁడ వెవ్వ రెఱుంగు వారు నీ
పోకలు? పోగకన్నవలఁ
బొల్చు లతాంగులు క్రీడ సేయు ని
స్సైకత భూమినా పసుఁ
పోఁకుట? రాకిటు నన్ గలంపఁగాన్.

కలపం బొక్కమ్ము క్కల్లలాడి వన్నె నీ
కన్నప్పుటల్ క్షోనమ్మం

బులకుఁ గ్రొత్తలే? నీసుదర్శనమె చె
ప్పం గాదే? వాఙ్మాధురిన్
వలపుల్ చిమ్మెడు నీప్రియల్ వగవ న
వ్యక్తోక్తులం బల్కు ము
ద్దుల నాచిల్కలఁ బల్కరింతు! మతి తే
దో నీకు గోపాలకా!

౭

మాయాలీలలఁ జూపి నాపసిఁడిబొ
మ్మం దీసికొన్నంత నే
మాయెన్, నీనటనంబు లే నెఱుఁగనే!
యూసించి త్రైలోక్యరా
జ్ఞీయోగ్యల్ రమణీసహస్రములు
నిన్నే కొల్చి యుండంగ న
న్నా యిట్లల్లరి పాలుచేసి యప
హాస్యాలాడుటల్? మాధవా?

౮

జలధిప్రావృత మేదినీవలయర
త్నాదతు! మాచిత్రముల్
బలిమిన్ గైకొని చిన్నఁబుచ్చి మే
లా నీకు? నీయంత వా
రల కైన న్మఱి తప్పు తప్పె గదె! యిం
రట్టేల? మాగుట్టు వా

డల కెక్కించిన వారు వీరనక చు
ట్టా లెల్ల నిందింపరే!

విలయంబందు సమస్తజీవులను ని
వే మ్రింగి తత్తత్క్రియా
ఫలముల్ మాఱక యుండఁ గ్రమ్మఱ సృజిం
ప న్నేర్చి యన్నింటి క
వ్వల వెల్గొందెడి జ్ఞానమూర్తివి గదా!
వాహ్యాళికై తోడి చె
ల్వాలు పిల్వఁగ బువ్వుఁదోఁట కేఁగు మము ని
ల్వం బెట్టెదే మాధవా!

స్వామి! నిన్నుఁ గోరి నీకటాక్షముల గూర్చి
బొమ్మరిలు గట్టి తిరుప్రసాదమ్ము పెట్టి
పిలువఁబిలువంగ వచ్చి నీవెలమిఁ గనక
కాలితోఁ దన్నివైచితే కరుణమాలి!

౧౧

ముల్లోకములు తేజరిల్ల శోభిల్లు నీ
మణికిరీటమునకై మరగి మరగి,
ముయ్యేడు కయ్యాల మొనతెండ్లఁ జెండు నీ
ఖరపరశ్వథధార కెఱఁగి యొఱఁగి

బ్రహ్మాండకోటులఁ బ్రభవింపఁ జేయు నీ
ధర్మసంకల్పంబుఁ దలఁచి తలఁచి
వ్రజమండలముఁ దన్ప విజయంబు సేయు నీ
జలదమోహనమూర్తి వలచి వలచి
అబల లగు మేము, గోపిక లైన మేము
విరతి యెఱుఁగని విరహాగ్ని వేఁగ వలసె
నీ నెనరు గోరుకొను టిందుకే నఁటోయి!
అఖిలమాయాప్రకామ! రామాభిరామ.

ప్రార్థనా తరంగము :

తెప్ప వాల్పదు సుమీ ఱేపైన మాపైన
నిడుద కన్నుల నీరు నించుఁ గాని,
తలఁపు త్రిప్పదు సుమీ తగులైన నెగులైన
దరసుదర్శనలీల లరయుఁ గాని,
మఱపు జెందదు సుమీ మరులైన గురులైన
జలజాయతాక్షులఁ గొలుచుఁ గాని,
శయ్య పీడదు సుమీ జాగైన వేగైన
విరహాగ్నికీలల వేగుఁ గాని,
తళుకుఁ జెడిన కన్నులఁ జెలువు గులుకు
చలువ తరఁగల కావేటి కెలన నున్న
రంగపురి నేలుకొన్న శ్రీరంగ శాయి!
ఈ యబల నేమి సేయఁగా నుంటి వోయి!

౨

తామరసాక్ష! నీదయఁ జూపు మని కోరి
కన్నీటి మున్నీటఁ గళవళించు,
వటపత్రశాయి! యీ నటన లేమని కుంది
నిట్టూర్పు గాడ్పులఁ గొట్టు కాడు,
శ్రీపతీ! నాపాపమా పల్క షని పిల్చి
వలకాక సోకుల జలదరించు
నీరదశ్యామ! నా నేర మేమని వేఁడి
తగులంపు నెగులునఁ దల్లడిల్లు
నీత్రివిక్రమలీలలనే స్మరించి
నీజగత్కారణాకృతి నే స్మరించు
రంగపురి నేలుకొన్న శ్రీరంగశాయి!
ఈ యబల నేమి సేయఁగా నెంచితోయి!

3

ప్రీడ యొకింత లేక పల
వించును నీకయి, యింటి వెంట నీ
జాడలె చూచు, నోయసుర
సంహార! కేవల! యంచు వేఁడి క
న్నోర్చుచు, నిన్నగోచరుని
మూర్తిగఁ గాన్పఁ దలంచు నింక నీ
చేడియఁ జేర్చు టెట్లొ దయ
చేసి వచింపుము రంగనాయకా!

౮

సకియ పెన్నొడలపైఁ జాఁచిన చరణముల్
జాఁచి నట్లేయుండె జలజనేత్ర!
ఎఱుక లేక యి మోడ్చి యెత్తిన కేల్దోయి
యెత్తి నట్లే యుండె నీశ్వరేశ!
ఆశ చెడ్డది గదా యనుచు నాచిన పల్కు
లాఁచి నట్లేయుండె నమరవంద్య!
ఎద నిల్పి నినుగొల్వ నెంచి మూసిన కన్ను
మూసి నట్లే యుండె మోహనాంగ!
నిర్దయుఁడ వని యెఱిఁగియు నిన్నుఁ గోరి
పరవశాలసయై మూర్ఛ పడిన యట్టి
లోడ తెలియంగకయే పడియున్న దోయి!
రంగశాయి! మాచెలిఁ బ్రోవ రావఁటోయి!

౯

ఎడఁద బగిల్చి, సంజ నను
రేశ్వరుఁ గూల్చిన నిన్ను మెచ్చి, పా
ల్కడలిని వెన్నఁ గొన్న నినుఁ
గాంక్షయొనర్చి పరిభ్రమించి, ప్రే
ముడి వలపించు నీకుఁ గయిం
మోడిచి వేఁడుచుఁ మూర్ఛఁ గన్న యీ
పడఁతుక నెట్లు బ్రోచెదో కృ
పారససాగర! రంగనాయకా!

చేసితి వెన్నో చిత్రములు
చెల్వామనోధనముల్ హరించి, పేం
చేసితి వాత్మవైభవము
చే వలపించి, తపించి కుందఁగాఁ
జేసితి, వింత చేసి దయ
సేయక యుంటి విదేమొ కాని, నీ
చేసిన లోపమో యబల
చేసిన పాపమొ రంగనాయకా!

౭

పాలమున్నీట నీవజ్జఁ బడిన యట్లు
ఘనఘనశ్యాము నిన్నెనసి నట్లు
సుఖదుఃఖదాయి నీసొమ్మె తానై నట్లు
కాలస్వరూపు నిన్ గాంచి నట్లు
అర్చావతారు నిన్నర్థిఁ గొల్చిన యట్లు
దరచక్రధరు నిన్ను దరిసి నట్లు
వ్రజసార్వభౌము నిన్ వలచి కైకొని నట్లు
శ్రీరంగధాము నిన్ జేరి నట్లు
తన్నుఁ దలపోసి, కాకున్నఁ దనువు రోసి
కాంక్ష లెడఁ జేసి, వలపోసి కన్ను మూసి
యొడ లెఱుఁగకయే పడియున్న దోయి
రంగశాయి! మాచెలిఁ బ్రోవ రావఁటోయి!

౮

కొండను మోచి గోవులను
గోవులఁ గాచిన యట్లు, దాసులన్
రండని ప్రోచు నీకు దయ
రాదని మిన్నులు నూచి మ్రొక్కుచున్
గుండెలు గొట్టి నిట్టురుఁ
గుట్టుసురై పడియున్న జాళివా
కొండను మాకుమారిఁ గయి
కో భర మయ్యెనె? రంగనాయకా!

సిరి నివసించు పేరురము
చేత నిలాసతి కొల్వు సేయు నుం
దరవదనంబు చేత నిర.
తం బెడఁ బాయని నీళకౌఁగిటన్
దిరమగు మేని చేత గడదేఱిన
నిన్ను వరించి యన్య మే
మెఱుఁగక యున్న మాయబల
కేగతి నూపెదో రంగనాయకా!

౧౦

భువనత్రయం బైనఁ బూనఁ జాలని నిన్ను
జెలువంపుఁ గౌఁగిట నిలుపఁ గోరి

చతురాననుం డైన శ్రుతులఁ జూడని నిన్ను
జిబిబిలి పలుకులఁ దెలుపఁ గోరి
అసమాంబకుం డైన నరయఁ జాలని నిన్నుఁ
బ్రాణనాయకునిగాఁ బడయఁ గోరి
సిద్ధసంయము లైనఁ జేరఁ జాలని నిన్నుఁ
బ్రాణనాయకునిగాఁ బడయఁ గోరి
అభిమతార్థంబు సిద్ధించు నాస లేక
దొరలు మాచెలి కింక శ్రీచరణ సేవ
దొరక దనుకొంటిఁ గాని, సీబిరుదు నిలిపి
రమణిఁ గైకొంటివోయి శ్రీరంగశాయి!

( శ్రు తి వీ థి )

ఆవేశతరంగము :

౧

వీనుల విందుగా విన్పింప లేదఁటే
సరసమోహనపాంచజన్యరవళి?
కన్నులు చల్లగాఁ గాన్పింప లేదఁటే
జయవైభవానంతచక్రదీప్తి?
కాయ ముప్పొంగఁగాఁ గదియంగ లేదఁటే
కమనీయఖగరాజగమనలీల?
ఎదఁ బల్కరింపఁగా నెలమింప లేదఁటే
సుందరవదనారవిందశోభ?

నిగమనిత్యోత్సవానందనినద మదిగో!
నామనసు గొన్న నాప్రాణనాథుఁ డున్న
దివ్యతిరుపేర కిఁకఁ బోక తీరదమ్మ!
ఆఁగ వలదమ్మ! యింక నన్న నమ్మఁబోర!

౨

అలికచలార! నారె కిటు
లాడెద రూఱట లేక నావెతల్
దెలియరు గాక; కమ్మవిరి
దేనియసోనలఁ బూవుఁ గోనలన్
జెలఁగు తిరుప్పురిం గొలువు
సేసిన శ్రీశుని కావిమోవితే
నెల చవిఁ జొక్కి క్రమ్మఱదు
నెమ్మది యెమ్మెయి; నేమి సేయుదాఁ?

3

శ్రీవత్సకాంతులఁ జిక్కి రాకున్నదో?
సురభిళవనమాలఁ జూచి రాదో?
దరసుదర్శనలీలఁ దవిలి రాకున్నదో?
కర్ణకుండలశోభఁ గాంచి రాదో?
అధరబింబామృతం బాని రాకున్నదో?
వనజాయతాక్షుల వదలి రాదో?
వదనేందుచంద్రికల్ వలచి రాకున్నదో?
మాణిక్యమకుటంబు మఱగి రాదో?

శ్రీపతికిఁ జిక్కి నామది సిగ్గు దక్కి
మరలి రాకున్న దివి యేటి మాట లమ్మ!
దివ్య తిరుపేర కిఁకఁ బోక తీఱదమ్మ!
ఆఁగ వలదమ్మ! యింక నన్నమ్మలార!

౪

నాచెల్వంబు హరించి చన్న హరి నె
న్నాడించి సామోక్తులన్
యాచింపం జని నామనం బతని పా
దాబ్జంబులం జిక్కి యం
దే చైతన్యము దక్కి సాక్షి నిఁకమీ
రేమన్న నేమైన నే
నా చిత్తాబ్జవిహారి వీడఁ జెలు
లారా! నన్నుఁ బోనీయరే!

౫

శకటముఁ దన్ని, పూతనను
జంపి, వృషంబును గూల్చి, మద్దులం
బెకలిచి వచ్చి నేఁడు తిరు
పేర వసించిన యట్టి స్వామి నే
నకు మరులొంది కుంది గరు
వమ్మును శీలముఁ జంపుకొన్న నా
కిఁకఁ బరచింత లేల? భయ
మేల? ప్రబోధము లేల? నెచ్చెలీ!

౯

ముందట నిల్చియున్ జలద
మోహనగాత్రుఁడు పల్కకుండెఁ; నా
కందక యుండెఁ; నాసలు మ
హాంబుధు లై నను ముంచుచుండె నో
యిందునిభాస్యలార! బ్రదు
కేర్పడఁ దేర్పఁ దలంతు రేని గో
విందుఁడు గొల్వుసేయు తిరు
వేరకుఁ బోవఁగఁ ద్రోవఁ జూపరే!

౧౦

నెచ్చెలులార! ప్రాణవిభు
నిం గన నామన సేఁగి క్రమ్మఱన్
వచ్చిన జాడ లేదు; నలు
వంకలఁ జూచుటె యయ్యె; నిచ్చమై
వచ్చునొ? రాదొ? తెల్పఁ గల
వారినిఁ, బిల్చెడి వారి నైన నే
నెచ్చటఁ గాన; నచ్చటికె
యేఁగెడి దానఁ బనేమి నాకిటన్।

అన్నవలార! నేను బర
మాత్ముని పేర రచించి యున్న నా

చిన్ని కృతుల్ పఠించినను
శ్రీహరి ప్రేయసిఁగాఁ దలంచి మీ
రన్నది యాదిగా మనసు
నం దొక యాస జనించి వృద్ధియై
మిన్నును, మన్ను, సంద్రములు
మేరలు మీఱె నీ కేమి సేయుదుఁ ౯.

౯

పంతమె కాక నాపడెదు
పాటులు బోటులు మీఱెఱుంగరే!
స్వాంతమె నన్నుఁ బాసి చని
నప్పుడు తాలిమి దూలి యున్న నా
చెంతను మూఁగియే దివుట
చెప్పఁగఁ జూచెద రమ్మ! యింక నా
చింతలు దీఱ శ్రీహరినిఁ
జేరఁ దిరుప్పూరి కేఁగనీయరే!

౧౦

తిరుప్పురదివ్య మందిరు, యుధి
ష్ఠిరవై భవసుప్రతిష్ఠు, సు
స్థిరు, జగదేకరక్షకు, వి
చిత్రచరిత్రుఁ బయోదగాత్రు, సుధ

దరదరచక్రహస్తు సుమ
నఃప్రభుఁ, మద్విభుఁ బట్టి తేఁటిఁగాఁ
బురవనసీమలం గలసి
పోయెదఁ బోయిన సిగ్గిఁ కేటికిఁ

( శ్రు తి వీ థి )

౧

నిరాశాతరంగము :

ఉబుసైన లేదాయె సూర్యెల్ల నిద్దుర
మబ్బులోఁ బడి మాటుమణఁగి పోయె
సందైన లేదాయె జగమెల్లఁ జీఁకటి
మూఁతలోఁ బడి ముచ్చుమణిఁగి పోయె
కదలైన లేదాయె నదులెల్ల నిశ్శబ్ద
వీథిలోఁ బడి వెల్లివిరిసి పోయె
తలఁగైన లేదాయెఁ దమియెల్ల నశ్రాంత
సరణిలోఁ బడి పెచ్చుపెరిఁగి పోయెం
ముజ్జగము లిట్టి తఱిఁ దన బొజ్జఁ దాల్చి
పాముపైఁ బవ్వళించెనో యేమొ! స్వామి
లేచి రాఁడాయె, నా మొఱాలింపఁ డాయె
నేది గతి యింక? నాకుఁ బ్రాపెవ్వ రింక?

౨

కడలినిఁ బూడ్చి, భూతలముఁ
గప్పి, వియత్తల మాక్రమించి, న
ల్గడలను గ్రమ్మి భీకరవి
కారనిశాకృతినంధకార మా
గడ మొనరించు చుండ ఘన
గాత్రుఁడు గానఁగ రాఁడు, నీవునుం
గడచని యుంటి వింక ననుఁ
గావఁగ దిక్కెవరమ్మ చిత్తమా!

౩

ఎక్కడి కేఁగి తోమనస!
యిక్కడ రేయి యుగంబు వోలి మి
న్నెక్కి కలంచు చుండె, హృద
యేశుఁడు రాఁడు; వియోగ వేదనల్
పెక్కన మాయెఁ; బ్రాణములు
వీడుద మన్న నుపాయ మేదియుం
జిక్కక పోయెఁ; జింత లెడఁ
జేయఁగ నెవ్వరు దిక్కు నాకిఁకన్.

౪

తరుణీలోకవియోగశోకజలధిం
దాఁటంగ లేకేమొ సు
స్థిర తేజోనిధి, లోకబంధుఁ డుదయా
ద్రిం జేరు కొన్నాఁడు; సుం

దరబింబాధరుఁ డబ్జనేత్రుఁడు జగ
న్నాథుండు నాస్వామియుం
గరుణం జూడఁగ రాఁడు నేఁడు బ్రదుకం
గా శక్యమే నాకిఁకన్.

౫

చెలులును బంధులుం విరతిఁ
జెందని యీనడురేయి నావెతల్
దెలియక నిద్రలో మునిఁగి
తేలుచు నుండిరి; నీలవర్ణుఁడో
తెలిసియు రాక పోయె; నిటఁ
దెంపరినై మరణింత మన్న నా
కలుషపుఁ జేరు ధాత్రిఁ గల
కాలము నిల్చునె కాని మాయునే?

౬

వెనుకనె నిల్చి చిత్తమును
వేఁచుచు నున్నది యాస దోసమై;
మునుమునఁ జేరి కన్నులను
మూయుచు నున్నది రేయి మాయియై;
తనసిరి సొంపుఁ జూచుకొని
దర్పన మీయఁడు చక్రి వక్రియై;
ననుఁ గరుణింతు రెవ్వ రిఁక?
నాకెవ రాఁఊటఁ గూర్చు వారికన్.

౭

చినుకులతోడ మబ్బుఁ బెను
చీఁకటితోడఁ గరాళరాత్రియున్
బెనుపడి నన్నుఁ బెన్వెతలఁ
బెట్టుచు నుండ జగత్ప్రభుండు నా
యునికిఁ దలంచెనో తలఁపఁ
డో! దయసేయక పోయెఁ; బాదదా
సినిఁ గరుణించుటే భరమొ?
శ్రీపతి కోసురలార! చెప్పరే!

౮

యుగ మయి పోయె రేయి నను
నొంచుచు నున్నది; శీతవాతమా
శుగ మయి పోయె నాతనువు
సోలుచు నున్నది; యార్తిఁ బిల్చుటే
యుగ మయి పోయె నేమొ! యభ
యం బిడ రాఁడు రథాంగపాణి నే
నగ మయి పోయితిన్ విరహ
సాగర మింకెటు లీఁద నేర్తునో?

౯

ముసురులఁ దోఁగి, చీఁకటుల
మూఁగి నిశీథిని దావకీలలన్
విసరుచు నేచు చున్న యది
నింగి వెలుంగు మెఱుంగుఁ దేరు తొల్

దేనఁ బాడనూప కున్న యది
దీనశరణ్యుఁడు రాఁడు ప్రోవఁగా;
నసురుచు నిల్వ నీరగుచు
నుండుటయే బ్రదుకయ్యె నాకిఁకన్!

౧౦

నిలిచిన పాటునఁ నిలువు
నీరగు నన్గన లేక చింతచేఁ
గలఁచిన పాటునన్ ముసురు
కంటఁ గరంగెడు నీనిశీథినిం
దలఁచిన పాటునఁ విభుఁడు
తప్పక వచ్చునొ రాఁడొ తెల్పకే
మలఁచిన పాటునఁ నిదుర
మైకొనె లోక మిఁకేమి సేయుదున్.

(శ్రుతిపీథి)

విచారతరంగము :

౧

ప్రకృతి మెల్లఁ గరంచు పాటలాధరలీల
తామర మొగ్గ యందంబు నెఱవ
లోకముఁ దనియించు శ్రీకరచరణముల్
తామరపూవులఁ దలఁపు సేయ
భువనంబు లలరించు సువిశాల నయనముల్
తామర రేకుల దళము గూర్ప

జగముల నేలయించు శ్యామల తనుదీప్తి
తామరపాకుల గోము నూప
సరసి వలె నెట్టయెదుట సాక్షాత్కరించి
పాపరూపదురాపసంతాప మార్చి
యనుపమకృపామృతానగాహనముఁ గూర్చి
తీర్చి నను సేద దేర్పవే జీవదేవ!

2

ఎద వగులంగఁ బిల్చి కను
లెండఁగఁ జూచుట యయ్యెఁ గాని య
భ్యుదయవిభాకరాంశువిభ
వోజ్జ్వలనీలధరాధరంబనన్
నదమలరత్నమాళివిల
సన్నవనీరదమూర్తితోడ నా
యెదుటను దోఁచి ప్రోచు దయ
యింకను రాఁదగదా జనార్దనా!

3

పవలింటి దొర మించు రవల తురాయితోఁ
జిగురాకు పూవుల చేర్మతోడఁ
గ్రొమ్మించు రతనాల కమ్మల యొఱపుతోఁ
దీవమంకెన కావి మోవి తోడఁ
దొలివల్కుఁ దేనెలఁ జిలుకు కేల్దోవలతోఁ
గడిఁది సింగంపు నెన్నడుము తోడఁ

వానమబ్బుల చాయ లీను నెమ్మేనితో
సిరులొల్కు కన్నుదామరల తోడఁ
గనుల మెఱపించి, పలపించి, కానిపించి
కనికరము నించి, కులికించి, కౌఁగిలించి
పులక లొలయించి, యొలయించి ప్రోతు వనుచు
నెంత బతిమాలుకొన్న రావేమి కృష్ణ!

౪

తెల్లని వెండికొండ పయిఁ
దేలెడు నీలఘనాఘనంబు నాఁ
జల్లని పాలవెల్లి ఫణి
శయ్యఁ బరుండి సుఖింతుఁ గాని నీ
నల్లని మేను, బద్మనయ
నంబులు, బింబఫలాధరంబు నా
యుల్లము నెంతగాఁగలఁచు
చున్నవొ చూడవుగా శ్రియఃపతీ!

౫

అంబుదనీలవర్ణ! వను
భావన! పావన! తావకాంఘ్రిప
ద్మంబులు బాలసూర్యుల వి
ధంబున నామది వెల్గు చుండఁ దా

స్యంబు నొసంగ నైతి వది
యబ్బుర మైనఁ దమోవికారమో
హాంబుధి మున్గి నిన్మఱచు
నట్టి యుపాయము నైనఁ దెల్పవే!

౬

తోయజపత్రనేత్ర! నవ
తోయదగాత్ర! కళావిచిత్ర! కృ
ష్ణా! యిటు రమ్ము ర మ్మనిన
నా యుపచారము లెంచఁ బోక నై
హాయసవీథి నైన విపు
లావని నైనఁ బయోధి నైన, నిం
కేయెడ నైన నాకుఁ గొలు
విచ్చి కృపామతి నేలుకో గదే!

౭

అరుణాబ్జంబులఁబోలు కన్నుఁగవతో
నందంపుఁ గెమ్మోవితోఁ
గరపాదంబులతో, దిగంతవిలస
త్కల్యాణ తేజంబుతో
హరినీలారుచినిఁ బోలు నిన్ను మదిలో
నర్చింతు నేవేళ నీ
చరణాబ్జంబుల చెంత నిల్పుకొని దా
స్యం బీయవే శ్రీహరీ!

ఆయతభక్తినీయడుగు
లంటి భజింతు నంటన్న రాక నీ
శ్రీయుతమూర్తి మబ్బు తెరఁ
జేర్చి ననుం భ్రమయింతు వక్కటా!
పాయక నిల్చి కొల్చుటకుఁ
బాండవు లిచ్చిన దేమి నాఁడు, నే
నీయని దేమి? నేఁడు మొగ
మేనియుఁ జూపవు పార్థసారథీ!

సత్తుగలాని చందమున
శంఖమునొత్తితి, గారడధ్వజం
బెత్తితి, చుట్టువాలు మెఱ
యించితి, వార్తలఁ బ్రోతు నంచు నా
యుత్తరభూమి, నామధుర
నుద్భవ మందిన నాఁడె; నేఁడు నా
కుత్తుక యొండ నార్తిఁ బడ
కూయిడఁ బ్రోవవి దేమి మాధవా!

౧౦

పుట్టఁగ నేరనైతి నిలఁ
బ్రోవఁగ నీవవతారమూర్తివై
నట్టి దినంబు లందె; యిపు
డున్నియుఁ బోయిన నీవుఁ గూడఁ జూ

పట్టక పాలలో ఘృతము
ఛాతిఁ జరాచరభూతకోటి
గుట్టుగ నుంటి వెందుఁ గను
గొందు, నిన్నెట్లు భజింతు మాధవా!

౧౧

హోమసేవను లెల్ల సుఖఁ జూఱఁగొను వేళ
నొద్దనా నాకింత బ్రదుకు తెరువు?
క్షోణిచక్రం బెల్ల సుస్థిరం బగు వేళఁ
గలుగదా నాకింత నిలువ నీడ?
అగచరావళు లెల్ల నధికారు లగు వేళ
దొరకదా నాకింత చిఱుత కొలువు?
పసులు పామరు లెల్లఁ బరమర్షు లగు వేళ
నందదా నాకింత యవలి మెట్టు?
ఎన్నొ యవతారములను నీ వెత్తు నాళ్ళఁ
బుట్టలేనైతి నీపదాంబుజము లపుడె
పట్టలేనైతి నిపు డరూపకు, నగమ్యు
నెందుఁ గని నిన్ను సేవించుకొందుఁ గృష్ణ!

# నేను—తాను

ఎవ్వరికైనఁ దమకులగోత్రనామపరిచయము చేసికొనకుండఁ, దమ చరిత్రమును జెప్పఁదలఁచుకొనుట దుర్ఘటమే. దానికి ముందు "నేను" అనుశబ్దముతో నాచరిత్రమును బ్రారంభింపవలసి యున్నది. "నేను" అహంభావ పూరిత మైనశబ్ద మని నాకుఁ దెలియక పోలేదు. ఎంత గొప్పవారైనను, ఎంత నీచులైనను తాము తమనామములు నుచ్చరించుటకు బదులుగ "నేను" అని చెప్పుకొనుటయే యభ్యాసమై యున్నది. కాఁబట్టి నేను, నే నని చెప్పికొనుట పూర్వాచార విరుద్ధమైన కార్యము కానేరదు—నాచరిత్ర ప్రారంభమునందును, నాకులగోత్రాదులనుగూర్చి మీకుఁ బరిచయము కలిగించిన పిమ్మటను, నాకథ ముగించునప్పుడును, సర్వావస్థలయందును, ఆదిమధ్యాంతములతోఁ గూడిన నాచరిత్రమును జెప్పికొనునప్పుడు, ఉచ్చారణ సౌలభ్యమునకైనను నన్ను "నేను" అనియే చెప్పికొనుచుందును. అది నాసర్వనామ వాచకముగా మీ రనుగ్రహింపవలయును.

నేను నాచరిత్రమును బ్రారంభించుటకు ముందు నాతలిదండ్రులపేళ్ళను, కులగోత్రములును స్పష్టముగఁ జెప్పికొనవలసి యున్నది. నాతలిదండ్రు

ఎవ్వరో నాకుఁ దెలియదు. కాని, సమస్తప్రాణి లోకమును క్షమతో భరించుచుఁ బెంచుచు నన్నిటికిని మాతృస్వరూపిణియైన ధాత్రీదేవియొడిలో నేను పెరిఁగి పెద్దనైతిని. కావున నాదేవినే మాయమ్మగా నెన్నుకొనుచుంటిని. లోకవ్యవహారము నాలోకించుచు నొకప్పుడు కుతూహలమున మాతండ్రి యెవ్వరని మాయమ్మ నడిగితిని—అఖిలమును బుట్టించుటకుఁ గర్తయైన సర్వేశ్వరుఁడే మీతండ్రియని యామె యానతిచ్చెను. నేనింతవఱకు నాతండ్రిని జూడకున్నను, మాతృదేవతా మహితవాక్యమును విశ్వసించి, ఆసర్వేశ్వరుఁడే నాజనకుఁ డనుకొంటిని. భూదేవి తల్లియు, ఆదిదేవుఁడు తండ్రియు నైయున్న నాకు కులగోత్రప్రసిద్ధిని గూర్చి చెప్పికొనవలసిన యావశ్యక మేమున్నది?

ఇఁక నేనాఁడుదాననా మగవాఁడనా, ఆఁడుమగదాననా, మగయాఁడువాఁడనా, ఏమై యుందు నని మీరు నన్నుఁ బ్రశ్నింప నక్కఱలేదు. నాచరిత్రమును బట్టియు, నామాటలను బట్టియు, నెప్పటికప్పుడు మీ కావిషయము బోధ యగుచునే యుండును.

నాయద్భుతజీవిత మొకమహానాటకము. నే ననేక వేషములతో నీప్రపంచరంగమున నటించుచుందును.

ఆరూపభేదములనుబట్టి నామభేదములును, నామభేదములనుబట్టి లింగభేదములున్ను ద్యోతకము లగుచుండును. ఆయద్భుతదృశ్యములు మీకు నాయం దనేకత్వభ్రాంతిని గల్పింపవచ్చును. ఆయవసరములయందు మీరు తబ్బిబ్బుపడక నన్ను "నేను" గనే గ్రహించుచుండుఁడు. ఇంతగా హెచ్చరించుటకుఁ గారణ మేనఁగా:—కథ చెప్పునది నేనును, వినునది మీరును గనుక—నేనని చెప్పుచున్న నాకును, నేను, నేనని వినుచున్న మీకును నడుమ భేద మగపడవలయును గనుక—కంగారుపడి మనము కలిసిపోయినచోఁ గథ సాగదు గనుక—

నాజీవితమంతయును స్వప్నమయముగా నున్నది. నేను కలలోనే పుట్టితినో పుట్టియే కలఁగనుచుంటినో యింతవఱకును నాలోచించుకొన లేదు. మెలఁకువ తెచ్చుకొని ఆవిషయమును గూర్చి ముందొకప్పుడు మీతో ముచ్చటింతును.

జగద్ధాత్రియగు నాతల్లి నామీఁది ప్రేమచేఁ దన విశ్వైశ్వర్య మంతయును నాయధీనము చేసినది. ఎంత యైశ్వర్య మున్న నేమి? దానిని నే నొంటిగా ననుభవింపఁగలనా? ఈ యైశ్వర్యము నాతోఁ గూడి యనుభవింపవలయు ననునాశతో నొకమిత్రము నాతోడనే పుట్టి నన్నాశ్రయించుకొని నాకుఁ దోడు

నీడయై మెలంగుచుండెను. నేనును, నానెచ్చెలిమాట జవదాటక మసలుకొనుచుంటిని—

ఆతనికి నామీఁద నెంతయో మనసు—నాకా తనిమీఁద నెంతయో యిష్టము. ఆతనితోడిదే నా బ్రదుకు—నాతోడిదే యాతని వైభవము. ఆతనికి నేనే లోకము—నాకాతఁడే దైవము. మాయిద్ద అదియు నొకటే ప్రాణము. ఇన్నిమాట లెందుకు? నేనే తాననుకొనవచ్చును—తానే నే ననుకొన వచ్చును—

ఆతఁడు నాకన్నులకు వెలుఁగు—నాచెవులకు సంగీతము—నారసనకు సుధారసము—నాఘ్రాణము నకు సౌరభము—నామేని కలంకారము. ఆతఁడే నాకు సర్వస్వమును—

ఆతఁడు నాచూపులకుఁ జొక్కిపోవును—పలుకు లకుఁ బరవశుఁడై పోవును—చేతలకుఁ జిత్తరువై పోవును—వర్తనములకు వశుఁడై పోవును. అయిన నేమి? నే నాతనిచేతి కీలుబొమ్మను. ఆతఁడే నా జీవగఱ్ఱ.

ఆతఁడు నన్నొకనిముసమైన విడిచి యుండఁ జాలఁడు. ఆతనివీడి యొకక్షణమైన నేనును నిలువఁ జాలను. నాకాలిలోఁ గానంత ముల్లు గ్రుచ్చికొనిన నాతఁ డుస్సురుమనును. నాపెదవిపై రవ్వంత చీము

నవ్వు దోఁచిన నాతఁడు బ్రహ్మానంద మందును. అందుచేతనే యెట్టియాశయును లేనినేను ఆతని కొఱకే యీయైశ్వర్యభార మంతయు భరించుచున్నాను —

జగదాధారశక్తియగు మాతల్లి యనుగ్రహముచే నాకుఁ గామరూపగ్రహణశక్తి లభించినది. ఆప్రభావమువలన నేనాతని యిచ్ఛానుసారముగా ననేకాకృతులం దాల్చి నానావైశ్వర్యములును సర్వశక్తులును నాతని యానందముకొఱకే ధారవోయుచున్నాను.

చేప యగుట నేను—అంబునిధులలోఁ నీఁదించి సంబరపడుట తాను—పాము అగుట నేను పడగవిప్పి యాడించి ప్రమోదించుట తాను—పక్షి యగుట నేను ఆకాశమున కేళించి యామోదించుట తాను—మృగమగుట నేను—విపినవీథుల నెలయించి వినోదించుట తాను—అబలయగుట నేను—హావభావవిలాసవిభ్రమములు సూచించి యానందించుట తాను—పురుషుఁ డగుట నేను—బలపరాక్రమములు ప్రకటించి ప్రహర్షించుట తాను— వే యేల? నే నాతని దాసను— నాప్రాణమానధనాదు లన్నియు నాతనివే! నాసహాయముననే యాతనికి సర్వసిద్ధులును సర్వప్రసిద్ధులును గలుగుచున్నవి.

కాని, ఒక్కనిమిషము నేను లేకున్నచో నాతనికి నామరూపములే లేవు—అహంభావముచే నిట్లను చున్నానుగాని, అతఁ డొక్కనిమిషము నన్ను విడిచి నచో నాకు మాత్ర మేమున్నది?—'అచ్చటా' ము చ్చటా' లేని చచ్చుపెద్దన్ననే కాదా!

నేను స్త్రీనై [illegible] పాటింతును. [illegible]కీయనై [illegible] సాగింతును. [illegible] స్వప్నమున విలాస[illegible] సేవ[illegible] గృహస్థుం డనై [illegible] సాధ[illegible] [illegible] స్వవర్త నముల సాగింతును. [illegible]డనై విచ్చల విడిగ సంచరింతును. ఇది యంతయు నాతని యనుభ వము కొఱకే—అతని యానందము కొఱకే—నే నేపాపము నెఱుఁగను—నా కేయనుభవము లేదు.

ఆతని భావసంకల్పము వలననే నేను గ్రంథకర్త నగుచున్నాను. ఆతని రాగసంకల్పము వలననే నేను గాయకుఁడ నగుచున్నాను. ఆతని చిత్రసంకల్పము వలననే నేను శిల్పకారుఁడ నగుచున్నాను. నన్నం దఱు నాహ్వానించి సభలలో నభినందింతురు. అందల ములపై నెక్కించి యూరేగింతురు. అగ్రహారము లిచ్చి యనుగ్రహింతురు. ఎన్ని బిరుదము లిచ్చినను, ఏనుఁగులపై నెక్కించినను, పని చేసినను, ఆకీర్తి ప్రతిష్ఠలన్నియు నతనివే, కాని నా కేమున్నది? —

నా కక్కఱలేకపోయినను ఆతఁడు చెప్పినట్లు చేయుటయే నాపని— దొంగనై దారులు గొట్టి దానములు చేయుదును. దొరనై పట్టణము లేని ప్రజలను పీడింతును. కడజాతినై గంజి ద్రాగి గాదులు నిండింతును. అగ్రజాతినై యధికారముఁ జూపి యందఱి నణఁగద్రొక్కుదును. క్రూరుఁడనై కొంపలు గూల్చి కోవెలలు గట్టుదును. సాధువునై సంఘబలము గూర్చుకొని జనులను మోసగింతును. కుక్కనై గృహములఁ గాచెదను, గోవునై కొమ్ములఁ గ్రుమ్మెదను, ఆతని యాజ్ఞను బాలించుటకే. ఆతని కోరికఁ దీర్చుటకే!—

నేను కవినై కువిమర్శకుల చేతులలోఁ గ్రుంగిపోవుదును. నేను గురువునై విమతుల చేతులలో వేఁగిపోవుదును. నేను సంస్కర్తనై ఛాందసుల చేతులలోఁ జలించిపోవుచుందును. నేను దేశభక్తుఁడనై ద్రోహుల చేతులలోఁ దూలిపోవుచుందును. నేనుపకారినై కృతఘ్నుల చేతులలో నూఁగిపోవుచుందును. నేను స్వార్థపరుఁడనై యమాయికులచే నాదరింపఁబడుచుందును. నేను దాంభికుఁడనై యజ్ఞానులచే నర్చింపఁబడుచుందును. ఇట్టి కష్టనిష్ఠురములును, ఇట్టి కపటనటనములును నా కెందులకు? ఆతనికొఱకే— ఆతనిసంతుష్టికొఱకే—

అతఁడే మనసుచే సంకల్పించుకొనునో, ఏబుద్ధిచే నాలోచించుకొనునో, ఏచిత్తముచే విశ్వసించుకొనునో, ఏయహంకారముచేఁ బూనుకొనునో నే నెఱుఁగను గాని సంపూర్ణముగా నన్నాతఁడు వశపఱచుకొని నామూలముననే తనకోరిక లన్నియుఁ దీర్చుకొనుచుండును.

అతని కెప్పటికప్పుడే క్రొత్తక్రొత్త కోరికలు పుట్టుచుండును. ఆకోరికల ననుసరించి నేనును క్రొత్త క్రొత్తమార్గముల నంది క్రొత్తక్రొత్త రీతుల నలంకరించుకొనుచుఁ గ్రొత్తక్రొత్త విలాసముల నెఱపుచుందును. ఇన్నివేషములును వేయుట నేనే కాని అన్ని కోరికలుగల యాతఁ డెప్పుడు నొక్కలాగే యుండును!

నాకును నాతనికిని గలసంబంధము మీకు స్పష్టపఱుపవలయుననియే నే నింత విపులముగా ముచ్చటించుచున్నాను. తెలిసికొనవలయు నని మీరును గుతూహలించుచుందురు. మాకెంత దగ్గఱసంబంధమనఁగా—అతఁడు నాకన్నులలోఁ గన్ను లిడుకొని చూడఁగలఁడు—నాచెవులలోఁ జెవు లుంచుకొని వినఁగలఁడు—నాఘ్రాణమున ఘ్రాణముఁ జేర్చుకొని యాఘ్రాణింపఁగలఁడు—నానోటిలో నోరు పెట్టు

కొన్ని తినఁగలఁడు—నా సొమ్ములో నేను గలుపుకొని సుఖింపఁగలఁడు—ఇంతవఱకుఁ జెప్పఁగలిగితిని. తెలిసినదా మీకు?

ఇంకొకమాట— కథాసందర్భము ననుసరించి "నేను—తాను" అని చెప్పవలసి వచ్చినదిగాని— తాను లేక నేనును నేను లేక తానును మీకగపడుట యెన్నఁటికిని పొసఁగనే పొసఁగదు. తాను నేను కలసి "మేము" అని చెప్పుకొనుట కవకాశము లేదు. నన్నును నాతనిని కలిసి "మీరు" అని చెప్పుటకు మీకును అవకాశము లేదు. "నేను—తాను" అను మాయిద్దఱకలయిక యే "నేను" అని మీరు గ్రహింపఁగలిగినఁ జాలును!

సూత్రమై యుండునది నేనె, జీవ
పాత్రమై నిండునది నేనె,
సారమై చేయునది నేనె, దుఃఖ
భారమై బాఱునది నేనె,
భోజ్యమై పుట్టునది నేనే, స్వా
రాజ్యమై గిట్టునది నేనె,
శక్తినై యేలునది నేనె, స్వచ్ఛ
ముక్తినై తేలునది నేనె.